Regd No. N. 45 / M 3813

వెల ఒక అణా

102820




★ చైనా రష్యా నాశ్రయించ జూచుట ★

★ హిట్లరుకు బ్రిటను సమాధానము ★

ప్రతి సోమ, గురు వారములందు వెలువడు జాతీయ పత్రిక

సంపుటము ౧౫ హైద్రాబాదు-దక్కన్ శా. శ. ౧౮౬౨ విక్రమసం॥ ఆషాఢ బ॥ ౬ (౧౯-౧౦-౧౩౪౯ఫ.) గురువారము సంచిక ౨౪

# బాల్టిక్ రాజ్యాలు రష్యాపద్ధతి స్వీకరించినవి

## భూమి, పెద్దపరిశ్రమలు ప్రభుత్వపు సొత్తు

### అందరికిని సమానమైన ధనపంపకము

బర్మామీదుగా చైనాకు మోటారుస్పిరిటు, ఇనుము, రైల్వేసామగ్రి, రోలింగ్ స్టాకు, మోటారులారీలు, మోటారుబండ్లు, వాటిభాగములు పోకూడదనబడ్డ జూలై ౧౮వ తేదినాటి బర్మాప్రభుత్వపు అసాధారణ గెజెటులో ప్రకటింపబడెను. జూలై ౧౮వ తేదినాటి అర్ధరాత్రినుండి ఆవస్తువులను బర్మామీదుగా చైనాకుపంపుట ఆపివేయబడియుండెను. ఈనిషేధాజ్ఞ బర్మాదేశరక్షణ ౫ ౯ క్రిందే గావించబడినది. ఈనిషేధ మమలుకు వచ్చునని తెలిసి వ్యాపారస్థులు లారీలకొలది నిషిద్ధవస్తువుల నిషేధ మమలువచ్చుటకు ముందు నాలుగురోజులనుండియు బర్మాసరిహద్దుకు లారీలకొలది యుద్ధసామగ్రిని పంపించిరి. జూలైగ౭వ తేది అర్ధరాత్రిలోగా చైనాసరిహద్దులోకి చేరద అనునట్లువేగముగా అనేకము రైలులారీలు ఆనాటి మధ్యాహ్నము ౩ గం.లకు బర్మాసరిహద్దులోనున్న లాష్ నుండి ౯యలుదేరిపోయెను. చైనా కేంద్రప్రభుత్వమునకుసరకులను గొనిపోవు "సౌత్ వెస్ట్ట్రాన్స్పోర్టేషన్ కంపెనీ" యొక్క మేనేజరు ఈవిధమైననిషేధమురాగలదని ముందే తెలిసి చైనాలో యుద్ధసామగ్రిని, ఆయుధములను ముందే చేర్చినామనియు, ఇప్పుడుచేర్పవలసినదిఎక్కువలేదనియు జూలైగ౯వ తేదినాడు ప్రకటించినారు. నిషిద్ధములైన సరకులతోకలిసి బర్మామీదుగా చైనాకు రైల్వేట్రక్కులు, పండ్లుతోముకొను బ్రష్షులు, ఔషధములు గుడ్డలుమున్నగునవి ౨౦౦౦ టన్నుల వస్తువులు పోవుచుండును. కాబట్టి బర్మామీదుగా చైనాకుపోవు సామగ్రి నిషిద్ధముగానివి ఎంతయోగలదు. ఒక బ్రిటిషువ్యాపారి చెప్పిన ప్రకారముగా బ్రిటిషువారినుండి చైనాకు ఇంతవరకు ఆయుధసామగ్రి ఏదియుపోలేదట. ఇప్పటియుద్ధారంభమునకు పూర్వము చైనాకువచ్చుచుండిన ఆయుధసామగ్రిలో అధికభాగము జర్మనీ ఇటలీ లనుండి వచ్చినదట. తర్వాత ప్రతిశరీరంలెక్కవ అమెరికానుండివచ్చినదేయని అతడనుచు, బ్రిటిషువారిపై ఎట్టితప్పుగాని లేదనుచున్నాడు, బర్మా పెట్రోలుసైనను బర్మాఆయిల్ కంపెనీకి బ్రిటిషు రేవులో కేవలకపు పెట్రోలునిచ్చిన ఒక అమెరికా కంపెనీకి బదులుగాఇవ్వబడవేగాని అమ్మడంలేదని ఈవార్తకునివాదము.

#### చైనాలో ఆలోచన

ఏదిఎట్లయిననేమి ఈనిషేధముచే చైనాకుసంకటమే కలిగినదనుమాట సరియైనదే. లేనిచో చైనాప్రభుత్వమువారు జపానుకోరికకు లొంగినందుకు బ్రిటిషుప్రభుత్వముపై అంతగట్టిగా ఆక్షేపణచేయవలసిన అవసరమేమి? ఇప్పుడు బర్మారోడ్డు బంధితమగుటచే సముద్రమార్గమున చైనాకు ఆయుధసామగ్రి లభించవీలులేకుండా పోయినందువలన చైనాప్రభుత్వాధికారులు రష్యానుండియు, చైనాలో పశ్చిమపు కొసననుండి రాష్ట్రమగు జెక్యాంగునుండియు భూమార్గమున ఆసామగ్రిని తెప్పించువిషయమై ఆలోచనలుచేయుచున్నారు. ఎట్లైననేమి' చైనాప్రభుత్వమును పత్రికలును కొనవరకు పోరాటమునుసాగించవలెననియే నిశ్చయమును వెల్లడించుచున్నవి. ఇందుకై దేశములో ప్రభుత్వముతో కమ్యూనిస్టులకుగల భేదములు పరిష్కారముచేసికొనబడినవి.

#### అమెరికా, ఆస్ట్రేలియాల వైఖరి

బర్మారోడ్డుమీదుగా చైనాకు యుద్ధసామగ్రిని నిషేధించువిషయములో బ్రిటిషుప్రభుత్వమువారు అమెరికాప్రభుత్వమువారియొక్కయు, ఆస్ట్రేలియాప్రభుత్వమువారియొక్కయు వైఖరిని ముందుగావిచారించి కనుగొనినట్లు తెలిసినది. ఆస్ట్రేలియాదేశాంగమంత్రిగారు సిడ్నీలో జూలై ౨౦వ తేది తమ ప్రభుత్వవైఖరిని వివరించుచు పసిఫిక్ సముద్రప్రాంతములో శాంతియుండుటవల్ల ఆప్రాంతమందు ఏదోఒకవిధముగా శాంతిఉండుట మంచిదని తలచి జపానుతో బ్రిటిషువారు ఒడంబడిక కుదుర్చుకొనుటయే మంచిదని తలచితిమనిరి. జపానుతో ఒడంబడిక చేసికొననిచో జపాను పసిఫిక్ప్రాంతములో యుద్ధజ్వాలను లేపవచ్చును. దాని నాపుకొనుటకు ఆస్ట్రేలియావలెనే అమెరికాకూడ సిద్ధముగాలేదు, కాని అమెరికాలో "న్యూయార్కు హెరాల్డు ట్రిబ్యూను" అనుపత్రికయొక్క అభిప్రాయము అమెరికా అభిప్రాయముగ గ్రహించదగినచో, ఇక మూడు నెలలలో బ్రిటనుస్థితి బాగుపడినట్లయిన బ్రిటను తిరిగి బర్మారోడ్డు బంధనమునకు అంగీకరింపక, సింగపూరుకు తమయుద్ధనౌకలను పంపించి పరిస్థితి నెదుర్కొనగలదని అమెరికనులు ఆశగానున్నది.

#### చైనాసముద్రంలో యుద్ధము

జపాను నౌకాసేనలు చైనాలోవిఘాకియన్ రాష్ట్రములోని ఫూచౌకు ఈశాన్యమున ౫౦మైళ్ల దూరముననున్న సాంటుదీవివద్ద జూలై ౨౦వ తేదినాడు దిగెను. చియాంగ్ కేషేక్ గారికి యుద్ధసామగ్రిపోవు మార్గములను ఆటంకపరచుటకు ఈసేనలు చర్యలనుగైకొనెను.

#### షాంఘాయిలో దౌర్జన్యము

చైనాలో షాంఘాయిలో సాంచియన్ సాగ్ అనునతడు వార్తాపత్రికలను ప్రకటించు ఒక వర్తకసంస్థయొక్క డైరెక్టరు. ఇతడు చేంకింగ్ ప్రభుత్వమునకు అనుకూలుడని ఉత్తరచైనాలో జపానువారేర్పరచియున్న నాన్కింగ్ ప్రభుత్వము ఆక్షేపణ తెలిపియుండెను. తుదకు జూలై ౧౯వ తేది సాయంకాలము షాంఘాయిలో రాచబాటయందుండే ఒకహోటలులో అతనిని తుపాకితో కాల్చిచంపినారు.

#### జపాను క్రొత్తమంత్రివర్గము

జపానులో క్రొత్తమంత్రివర్గ మేర్పడినది. ప్రధానమంత్రి ప్రిన్సుకోనోయిగారు విదేశాంగమంత్రి యోసుకేమాట్సుఓకా ఆర్థికమంత్రి ఈసాద్ కావాడా దేశీయాంగమంత్రి విజియా సూవియా, యుద్ధమంత్రి లెఫ్టినెంటు జనరల్ హిడికిటోజో: నౌకాశాఖమంత్రి వైస్ అడ్మిరల్ జెన్గోయోషిడా వీరుగాక యింకను ఆరుగురుమంత్రులుగలరు.

ములప్రధాననగరములలో ప్రజలుప్రకటన చేసిరి.

ఈవిధముగా ఇప్పుడురష్యాకు ౭౦ వేల చదరపు మైళ్ల ప్రదేశమున్ను, ౭౦ లక్షల ప్రజయున్ను ఒకకొత్తరుచుక్క రాల్చవలసిన అవసరము లేకుండలభించినది. ఇంతేగాక ౩౫ మైళ్ల బాల్టిక్ సముద్రతీరములభించినది. ఇప్పుడు లిథుయేనియా తూర్పుప్రష్యా సరిహద్దులవెంట రష్యా జర్మనీలసరిహద్దులు ౧౨౦ మైళ్లవరకు ఒకదానికొకటితగులుకొనినవి.

#### రుమేనియా వ్యవహారము

రష్యావారిసేనలు బెసరేబియాను ఆక్రమించుకొనుటలో కొన్నిచోట్ల పోవలసిన హద్దుదాటి ముందుకుపోయినట్లు ఇదివరకు చూచియుంటిమి. తర్వాత రుమేనియా సైనికాధికారులు ఈతప్పును రష్యా అధికారులకు ఎరిగించగా, రష్యా అధికారులు తమసేనలను పోమూరావద్ద డోరోహాలో జిల్లానుండి తమసేనలను తొలగించివేసిరి.

జూలై ౧౯వ తేదినాడు జర్మను శాసనసభయగు రీచ్స్టాగులో హిట్లరుగారు ఉపన్యసించుచు రష్యా జర్మనీలు తమతమ అధికారవ్యాప్తి ప్రాంతములను నిర్ణయించుకొనినవని చెప్పియుండిరి. దానికర్థము రుమేనియాపై జర్మనీఅధికారమును వదలుకొనినదనియు ఆదిరష్యావారి అధికారవాతావరణములో నుండగలదని కొందరు రాజకీయతంత్రపటిమలు తలచుచున్నారు

తుర్కీనుండి ప్రతినిపంపి రుమేనియానుండి పెట్రోలు సంపాదించుకొనవలెనని కాబోలు తుర్కీ రాయబారులుకొందరు రుమేనియా ప్రధాననగరమగు బుఖారెస్టుకు పోయియుండిరి. వారు రుమేనియా మంత్రులతో సంభాషించి, తుదకు ఏమియు ఒడంబడిక కుదరనందున జూలై ౨౧వ తేది తమదేశానికి వెళ్లిపోయినారు.

రుమేనియానుండి ట్రాన్సిల్వేనియాను రాబట్టుకొనుటకై హంగరీయు, డోబ్రుజాను రాబట్టుకొనుటకై బల్గేరియాయు ఆందోళన ప్రారంభించుసరికి ఏదిఎట్లువచ్చినను సిద్ధముగనుండి ఎదుర్కొనుటకై రుమేనియాసేనలు హంగరీ, బల్గేరియాల వైపుననుండు రుమేనియా సరిహద్దులకు పంపబడియుండెనుగదా! అసేనలిప్పుడు తొలగించబడినవి.

#### క్రొత్త ఒడంబడికలు

ఈనాలుగురోజులలో రెండు క్రొత్తఒడంబడిక వార్తలు కనపడుచున్నది. ఒకటిఇటలీ స్పెయినులు మధ్యధరాసముద్రమునుగూర్చి ఒడంబడికకుదుర్చుకొన్నవట. అందుకై అగస్టు మొదటిపక్షములో జనరల్ ఫ్రాంకోగారు ముసోలినిగారితో కలిసి సంభాషించెదరట.

హంగరీ జర్మనీలు ఒకవర్తకము ఒడంబడికను కుదుర్చుకొనినవి. దానిపై జూలై ౨౦వ తేది ఇరుపక్షముల ప్రతినిధులును సంతకములనుచేసినారు సాధారణముగా ఈఒడంబడికలు మూడేండ్లకాలములలోనుండునట్లు చేసికొనబడుచుండినను, ఇప్పుడుయుద్ధభయమువల్ల ఏర్పడియున్న అస్థిరతచే ఈసారి ఒకసంవత్సరకాలము అమలులోనుండునట్లు మాత్రమే ఒడంబడిక చేసికొనబడినదట.

#### అమెరికా

అమెరికాలో డెమొక్రాటిక పార్టీవారిమహాసభ సమాప్తియైనసంగతిని గతసంచికలో చూచినాము ఇప్పుడు హవానాలో అఖిల అమెరికా రాష్ట్రమహాసభ జూలై ౨౧నాడు ప్రారంభమైనది. జూలై ౨౨వ తేదినాడు ఈ సభలో అమెరికా సంయుక్తరాష్ట్రముల స్టేటుసెక్రెటరీఅగు కార్డల్ హాల్ గారు ఉపన్యసించిరి.

ఇప్పుడు యూరపుఖండపు దేశాలకు అమెరికా ప్రాంతములో కొన్ని రాజ్యాలున్నవి. జర్మనీ యూరపులోఅనేకదేశములను వశపరచుకొనినది. అట్లు వశపరచుకొన్న దేశాలకు సంబంధించినరాజ్యాలు ఎక్కడనున్నను తనకే అవి జర్మనీ కోరవచ్చును. కాని ఇవి సముద్రాంతరముగల రాజ్యాలు కాబట్టి జర్మనీ వాటిని ఆక్రమించుకొనకుండ బ్రిటను పోరాటమునకువచ్చుట అనుకూలమైనవిషయమే, అందువల్ల ఎట్లయిన నేమి అమెరికాప్రాంతములో యూరపుదేశాల రాజ్యాలవిషయమై పోరాటములు ఉదయించవచ్చును, అట్లుఉదయించినచో అమెరికావారికి శాంతి చెడును. కాబట్టి ఈరాజ్యాలు ఇప్పుడెట్లాఉన్నవో అట్లేఉన్నట్లయితేసరే లేకుంటే వాటి ప్రస్తుతస్థితిని మార్చనీయకుండా అమెరికాలోని ప్రజాస్వామికరాష్ట్రాలే ఆరాజ్యాలకు ట్రస్టీలుగ నేర్పడుటయో లేక ఆరాజ్యాలను అమెరికాలో కలిపివేసికొనుటయో జరుగుట అమెరికా శాంతికి అవసరమని కార్డల్ హాల్ గారు సూచనచేసినారు. ఇదేవిషయమై సభవారు చర్చించగలరు.

సభవారు చర్చించదలిచిన ఇంకొకవిషయమేమనగా, యూరపుయుద్ధమువల్ల యూరపుఖండదేశాలకు అమెరికా అమ్ముచుండిన అనేకవస్తువుల అమ్మకము తగ్గిపోయినది. లోటును తీర్చుట ఎట్లుఅనువిషయ మాలోచించబడును.

ఇదియిట్లుండ అమెరికాకు ఇప్పుడుఅట్లాంటిక సముద్రరక్షణకు తగినంత నౌకాబలము మాత్రమేయుండుటవల్ల పసిఫిక సముద్రమువైపునుండి చిక్కుకు ఎదుర్కొనజాలక యున్నది. అందుచే రెండువైపులకును తగినంత నౌకాబలముండుటకై నౌకాబలమును హెచ్చించుటకు నిర్మించినవిశేషప్లపథకముపై అధ్యక్షుడు రూజ్వెల్టుగారు సంతకముచేసినారు. ఈవిధేండ్లలో ౭౦౧ యుద్ధనౌకలు తయారుచేయబడును వీటిలో ౨౦౦విమానాలు మోయునౌకలు, రాక్రూయిజర్లు, ౩౭౫ డిస్ట్రాయర్లు, ౧౧౦ జలాంతర్గాములు, ౩౫పోరాటపు ఓ

(రావ పేజీచూడుడు)

పాఠకులకు మనవి

గతసంచిక సమయములో ప్రథమైకాదశివచ్చెను. ఈసంచికాసందర్భమున సికింద్రాబాదు మహంకాళీపూజవచ్చెను. మాఆఫీసుకీదినాలలో సెలవులిచ్చుటచే ఈరెండుసంచికలు ౪ పుటలలో ముద్రించవలసివచ్చెను. మేము ఈసంవత్సరము ౮ పుటలే ముద్రింతుమని మొదటి సంచికలో తెలుపుకొన్నను కాగితములధర పెరిగిపోయినను ౧౦ పుటలు ముద్రించుచున్నాము. చిల్లర అమ్మకాలకు ఎక్కువప్రతులు ముద్రించుటలేదు. చాలామందికి ఒక్కొక్కతడవ పత్రిక లభించుటలేదు. కావున అభిలాషులు వెంటనే చందాదారులు కావలెను. జిల్లాలలోను పత్రిక అమ్మకానికై తాలూకాలలోను ఏజెంట్లుగా నుండదలిచినవారు మాకార్యాలయమునకు వ్రాసి వివరాలు తెలుసుకోవలెను.

మేనేజరు, గో. ప.



#### బాల్టిక్ రష్యామయమగుట

ఈజూలై ౧౮వ తేదినుండి ౨౨వ తేదివరకు వచ్చినవార్తలలో ఒక ముఖ్యవిషయము బాల్టికురాజ్యములన్నియు సోవియటు రాజ్యాంగపద్ధతిని స్వీకరించుటయైయున్నది. జూలై ౨౧వ తేదినాడు లిథుయేనియా, ఎస్టోనియా, లట్వియాలలోశాసనసభలు సమావేశమై సోవియట్ రాజ్యాంగ స్వీకారముచేసినవి. అప్పుడే లట్వియాలో ఎవడుగాని ౩౦ హెక్టారుల విస్తీర్ణముకంటె ఎక్కువ సేద్యపుభూమిని ఉంచుకొనరాదనియు, తక్కిన భూమియంతయు ప్రభుత్వమువారిచే ప్రజలందరికిని సమానముగా పంచబడుననియు ఆజ్ఞ చేయబడినది— బ్యాంకులు పెద్ద వర్తకపు కంపెనీలు ఫాక్టరీలు ప్రభుత్వముయొక్క సొత్తుగా భావించబడునని లట్వియా శాసనసభవారు తీర్మానించినారు.

జూలై ౨౧వ తేదినాడురాత్రి ఎస్టోనియా, లిథుయేనియా, లట్వియాలలో శాసనసభల తీర్మానములయెడ ప్రజలఆమోదమున్నదని ఆదేశ

# రష్యాజర్మనీలమైత్రిచెడదు

## శత్రువులకుట్రలు వ్యర్థములగును

రీక్‌స్టాగ్‌లో హిట్లరుఉపన్యాసము

బర్లిను, జూలై ౧౯

హిట్లరు ఒసగనున్న ఉపన్యాసము వినుటకై నేటిదినము సాయంకాలము రీక్ స్టాగుసభ సభ్యులతోను ప్రముఖులగు ప్రేక్షకులతోను నిండియుండెను. ఈ సమావేశమునకు హాజరగుటకై ప్రత్యేకముగ నేటిదినము మధ్యాహ్నము బర్లినుకువచ్చిన ఇటలీవిదేశాంగమంత్రి కౌంటుసియానోగారు సభలో మొదటివరుసలో కూర్చొనియుండిరి. కౌంటుసియానోగారు సభలోనికిరాగానే వాన్‌రిబ్బనుట్రాపుగారు వారికి స్వాగత మొసగిరి. సభ్యులలో సైనికశాఖకు చేరినవారు సైనికపు టుడుపులను ధరించివచ్చిరి.

### యుద్ధమున మరణించినవారి ప్రశంస

జెనరలు గోరింగుగారు సభనుప్రారంభించుచు దేశక్షేమమునకై యుద్ధరంగములందు తమ ప్రాణములను ధారపోసిన జర్మనియోధులను ప్రశంసించి, వీరిమరణమువల్ల జర్మనీలో ఏకుటుంబమునకుగాని నష్టముకలుగకుండునట్లు రీక్‌స్టాగు ప్రభుత్వము తగుఏర్పాటులు గావింపగలదని అభయమొసగిరి.

## హిట్లరు ఉపన్యాసము

పిమ్మట హిట్లరుగారు ఈక్రింది ఉపన్యాసమొసగిరి:

"జర్మను జాతిభవిష్యత్తును నిర్ణయింపగల మహాసంగ్రామముమధ్య నేను ఈ సభకు మిమ్ములను ఆహ్వానించితిని ఇంతవరకు జరిగిన విషయములగురించి పూర్తివివరములను జర్మను ప్రజలకు తెలియపరచుట ముఖ్యమని నేనుతలచుచున్నాను, మన ప్రతిపక్షులు విచక్షణతోను పరేంగిత జ్ఞానముతోను వ్యవహరింపవలయునని మరియొక విజ్ఞప్తి గావింపనుద్దేశించితిని.

### వర్సెలీస్‌సంధి

విదేశాంగ వ్యవహారములందు నేషనల్ సోషలిస్టుపక్షమువారు వర్సెలీస్‌సంధి రద్దుకావలయునని మాత్రమే కోరుచున్నారు. ఫ్రాన్సు, బ్రిటనులవిజ్ఞానము నాగరికత ప్రపంచమునకు సక్రమమగు మార్గమును చూపగలవను ఆశ కేవలము పిచ్చిభ్రమయని నిరూపింపబడినది. అలసత్వమువల్లను అసమర్థతవల్లను బ్రిటను ఫ్రాన్సులు తమ నాయకత్వమును కోల్పోయినవి. బ్రిటను, ఫ్రాన్సులను ప్రతిఘటించుటకు, జర్మనుప్రజలు తమకోరికలను సఫలపరచుకొనవలసివచ్చెను

### యుద్ధపరామర్శ

యుద్ధము జరిగిన జర్మనీకే విజయము కలుగునను పూర్తినమ్మకము నాకు మొదటనుండి గలదు. నాకీ విషయమున సంపూర్ణమగు ఆత్మవిశ్వాసమున్నందున నే ఎట్టిషరతులుగాని తెలుపక ప్రధాన రాజకీయ సమస్యలను సౌమ్యముగ పరిష్కరించుకొనుటకు బ్రిటను ఫ్రాన్సులసహకారము కోరితిని. యుద్ధపు ప్రారంభదశలోనే నేనీ సూచనగావించితిని. చీవాట్లతో బ్రిటను ఫ్రాన్సు అధికారులు నాసౌమ్యవిధానపు సూచనలకు ప్రత్యుత్తరమొసగిరి. ఛేంబర్లెనుగారు బహిరంగముగ దుర్భాషలాడిరి. ఐరోపా రాజ్యములను యుద్ధములోనికి దింపవలయునని బ్రిటను, ఫ్రాన్సులు ప్రయత్నించుచుండ జర్మనీ సైనికబలమును వృద్ధిచేయు ప్రయత్నములందు నేనుంటిని. వర్షములవల్ల కొన్నినెలలు యుద్ధము సాగింప వీలులేకపోయెను.

స్వీడనులోని ఇనుముగనులను తమ స్వాధీనమొనర్చుటకై నార్వేమీదుగ స్వీడనుకు సేనలనుపంపుట బ్రిటిషు ప్రభుత్వమువారుద్దేశించునట్లు తెలియవచ్చెను. వాగాడంబరప్రియులగు చర్చిలుగారే ఈరహస్యపుగుట్టును వెలిబుచ్చిరి. ఈ కారణమువల్ల జర్మనుసేనలు నార్వేను ఆక్రమించుకొనవలసివచ్చెను. జర్మనీసైనిక చరిత్రలో నార్వే ఆక్రమణము జర్మనీసేనల నిరుపమానమగు ధైర్యసాహసములను ప్రదర్శించు అపూర్వమైన ఘట్టముగనున్నది.

యుద్ధము ప్రారంభమగుటకు పూర్వమే మాజినోకోట శ్రేణిని ధ్వంసమొనర్చుటకై జర్మని సైనికాధికారులు పన్నాగములు చేసియుండిరి. ఇవి సఫలము కావలయునన్న బెల్జియం, హాలండులను ఆంటుకొనియున్న ఫ్రాన్సుసరిహద్దులవద్దకూడ కొంతచర్యతీసికొనుట అవసరమని తోచెను. ఈరహస్యమును బ్రిటను, ఫ్రాన్సులుకూడ గుర్తెరిగి, మేనెల ప్రారంభమున బెల్జియం, హాలెండుదేశముల నాక్రమించుకొన నుద్దేశించెను. అందుచే బ్రిటను, ఫ్రాన్సులకంటె ముందేగు జర్మనీసేనలు బెల్జియం, హాలండులను ఆక్రమించుకొనవలసివచ్చెను. ఈసందర్భమునజరిగినపోరాటంబు ఐరోపాఖండమునకు పంపబడిన బ్రిటిషు సైనికదళము నామరూపములులేక నశించినది. జర్మని సైనికాధికారుల ప్రతిభావిశేషముల కిది నిదర్శనమని చెప్పవచ్చును.

పిమ్మట ఫ్రాన్సులో యుద్ధము ప్రారంభమయ్యెను. పారిసునగరమును స్వాధీనపరచుకొనవలయునను ఉద్దేశ్యము మొదట మాకు లేకుండెను. జర్మనుసేనలు ఫ్రాన్సులో జొరబడి స్విడను సరిహద్దులు చేరవలయునని మాత్రము ఉద్దేశించితిమి కాని ఫ్రాన్సులో కొన్నిదినములలోనే జర్మను సేనలల సంపూర్ణమగు విజయము సిద్ధించెను.

### ప్రశంసలు

శత్రువిమానములను ధ్వంసమొనర్చుట, శత్రువులకు సామగ్రి చేరకుండునట్లు రవాణా సౌకర్యములను ధ్వంసమొనర్చుట, శత్రు రాజ్యములలో గాలి గుమ్మటములద్వారా సేనలనుదింపుట మున్నగు కార్యములను మనవైమానికులు ప్రశంసనీయమగువిధమున నిర్వర్తించిరి, కాని ఈవిజయము సాధించినవారు ముఖ్యముగ మనసైనికులనియే చెప్పవలెను. జర్మనీలో జర్మనుప్రజల ఐకమత్యము. నేషనలు సోషలిస్టుపక్షపు నిర్మాణము లేనిచో మనకీవిజయము సమకూరెడిదికాదు. ఇందులకుగాను రిబ్బనుట్రాపు: గోరింగుగార్లకు వందనము లర్పించుచున్నాను. ఈసందర్భమున గోరింగుగారిప్రతిభ నిరుపమానమయినది. ఇందులకుగాను వారికి "రీక్‌మార్షల్" బిరుదమును, "ఐరనుక్రాసు"ఒసగి సత్కరించుచున్నాను. (సైనికశాఖకుచేరిన వాన్ బ్రౌచిష్ వాన్‌రబినాగార్లకును, మరిపలుగురికిని "మార్షలు" బిరుదములు, వైమానికశాఖకుచేరిన ముగ్గురికిని "ఫీల్డుమార్షల్" బిరుదములు, ఇవ్వబడినట్లు హిట్లరు ప్రకటించెను,)

### ఇంగ్లాండు మైత్రి కుదరలేదు.

జర్మనీలో నేషనలు సోషలిస్టుల పరిపాలన ప్రారంభమైనది మొదలు బ్రిటను ఇటలీలతో మైత్రిని వృద్ధిచేసికొనుటయే విదేశాంగవిధానమున ముఖ్యసూత్రముగనుండెను. నేనును, జర్మను ప్రజలును మొదటినుండియు బ్రిటను స్నేహమును వాంఛించుచుంటిమి. గాని ఈ విషయమున నా ప్రయత్నము లన్నియు విఫలమైనందులకు చింతించుచున్నాను. సద్భావముతో బ్రిటను మైత్రినిసంపాదింప నేను గట్టిప్రయత్నములు గావించితిని.

### ఇటలీ మైత్రి

జర్మనీదేశము మరల ప్రాముఖ్యమునకువచ్చిన పిమ్మట జర్మనుజాతి కష్టసుఖములను గమనించి సానుభూతి తెలిపినది ఒక్క ఇటలీమాత్రమే. యుద్ధము ప్రారంభమైనది మొదలు ఇటలీ అన్నివిధముల మనకు తోడ్పడుచుండెను. యుద్ధమున ప్రత్యక్షముగ పాల్గొనవలసిన సమయము వచ్చినదని తనకుతోచగానే యుద్ధ ప్రకటన గావించి తనసేనలను యుద్ధరంగమునకంపెను. ఇకయుద్ధము సాగించుట నిరుపయోగమగు కార్యమని ఫ్రాన్సుగ్రహించుటకు ఇటలీ యుద్ధప్రకటన ప్రబల కారణమని చెప్పవచ్చును. ఇటలీజర్మనీల సమిష్టి ప్రయత్నములవల్ల అఖండమగు విజయము సమకూరగలదు.

### జర్మని బలము

నేను భవిష్యత్తును గురించి కొన్ని మాటలను చెప్పదలచితిని ఆత్మోత్కర్షకై నేనీమాటలను చెప్పుటలేదు. ఆత్మోత్కర్ష ప్రగల్భములు చర్చిలువంటివారికి అవసరము, నాకట్టిఅవసరము లేదు. యుద్ధపు పరిణామమువిషయమై నేను చెప్పినమాటలే నిజమైనవి. విపత్తు, నష్టములవల్ల బ్రిటను మరింత బలవంతమగు జాతిగ ఏర్పడునని బ్రిటనునాయకులు చెప్పుచున్నారు. విజయానుభవమువల్ల అంతకంటెఎక్కువ బలవంతమైన జాతిగ జర్మనులు ప్రకాశింపగలరని నేను చెప్పుచున్నాను. సైనికవిషయములందు నేడు జర్మనీ బలము అన్నివిధముల లోటులేనిదిగనున్నది ఇంతటి బలము జర్మనికి ముందెన్నడు లేకుండెననియే చెప్పవచ్చును. యుద్ధములో ఇంక ఎక్కువనష్టములు కలుగునని తలచి అందుకు సిద్ధపడియుంటిమి. ఫ్రాన్సు యుద్ధమున మరణించిన సైనికుల సంఖ్య అంచనావేసికొనిన సంఖ్యకన్న ఎంతోతక్కువగనున్నది. ఈయుద్ధములో ఆయుధసామగ్రినష్టము అత్యల్పమయినది. ౪సంవత్సరములప్రణాళిక విజయవంతముగ సాగింపబడినందున సైనిక వైమానిక శాఖలకు కావలసిన సప్లయి విషయమై ఎట్టి కొరత గాని లేదు. ముడిపదార్థములలో ముఖ్యమైన ఇనుము బొగ్గు విస్తారముగ నిలవచేయబడినవి. ఈయుద్ధమున జర్మనీ స్వాధీనపరచుకొనిన రాజ్యభాగములలోని ముడిపదార్థములన్నియు ఉపయోగించుకొనగలము. యుద్ధకార్యమునకై ౨౦ కోట్లమంది ప్రజలు సిద్ధముగనున్నారు, యుద్ధమెంతకాలము సాగినను ఆహారపదార్థములవిషయమై యెట్టికొరతయుండదు.

### రష్యాతో సంబంధము

రష్యా జర్మనీలకు విభేదములేర్పడవలెనని బ్రిటను రాజకీయనాయకులు ఆశించుచున్నారు. జర్మనీ రష్యాలకు మనస్తాపమేర్పడిన ఐరోపరాజకీయములు తారుమారగుననియు, తత్ఫలితముగ బ్రిటనుకు బలముకలుగుననియు వీరుతలచుచున్నారు. రష్యా విషయమున పరిణామ మెన్నటికిని ఈవిధముగనుండదనియు బ్రిటనుకు ఈవిషయమున పూర్తిఆశాభంగము కలుగుననియు నేనుచెప్పుచున్నాను.

### బ్రిటను ఫ్రాన్సుల కొరకమాట

భవిష్యత్తు సంఘటనములపరిణామ మేవిధముగనుండునో నాకుగట్టిగ తెలియును. అయినను సరసమగుధోరణిని బ్రిటను ఫ్రాన్సులకు హితమొసగి సద్భావమును ప్రకటింప నుద్దేశించుచున్నాను. సంగ్రామమువల్ల ఎవరికి లాభముకలుగదనియు, ఉభయపక్షములకు నష్టముకలుగుననియు నేను మొదటనేచెప్పినమాటలను బ్రిటను ఫ్రాన్సు ప్రజలు నేటిదినము వేరువిధముగ తలచుచున్నారనినమ్ముచున్నాను. మొదటినుండి బ్రిటను యుద్ధమునకు ముందంజవేయుచుండెను. తుదివరకు యుద్ధము సాగింపవలయునని బ్రిటను రాజకీయనాయకులు ఘోషించుచున్నారు. యుద్ధము సాగించువిషయమున తమదృఢసంకల్పమును చర్చిలుగారు ఇటీవల ప్రకటించిరి. ఆరువారములక్రింద సైనికకేంద్రములుకాని జర్మనీనగరములపై బాంబులు వేయుకార్యమును బ్రిటను వైమానికులు ప్రారంభించిరి. సామాన్యనగరములమీదను, మార్కెట్టులమీదను చిన్నగ్రామములమీదను బ్రిటిషు వైమానికులు బాంబులు వేయుచున్నారు. ప్రతిక్రియలు సలుపవలయునని నేనింతవరకు జర్మను వైమానికులకు ఉత్తరువులివ్వలేదు. దీనినిబట్టి నేనెల్లకాలము ఊరకుండెదనని తలపకూడదు. ఏదోఒకదినమున బ్రిటనుదాడులకు ప్రత్యుత్తరమివ్వబడును. ఆనాడు బ్రిటనులో లక్షలకొలది ప్రజలుచెప్పరాని బాధలననుభవింపగలరు. కానిఈబాధలను చర్చిలుగారు అనుభవింపరు. బ్రిటనులో యుద్ధమునందు యిష్టముగలవారు తమబిడ్డలను ధనమును కెనడాకు పంపియున్నారు. ఇక్కడికి చర్చిలుగారు పోగలరు. కాని లక్షలకొలది బ్రిటను ప్రజలు ఘోరమగుదురవస్థపాలయ్యెదరు. భవిష్యత్తువిషయమై నేనుచెప్పినమాటలలో నొక్కదానినైనను ఇంతవరకు చర్చిలుగారు నమ్మలేదు. గొప్పదగు బ్రిటిషు సామ్రాజ్యము ధ్వంసమగునని నేనిప్పుడు చెప్పుచున్న ఈఒక్కమాటనైనను నమ్మవలయునని చర్చిలుగారిని కోరుచున్నాను. బ్రిటిషుసామ్రాజ్యమునుధ్వంసమొనర్పవలయుననిగాని. తుదకు దానికినష్టముకలుగజేయవలయుననిగాని నాకెన్నడు ఉద్దేశ్యములేదు. ఇదేవిధమున్న బ్రిటను జర్మనీలకుపోరాటముసాగిన ఉభయులలో ఒకడు పూర్తిగనాశనమైపోవునని నాకుతెలియును. జర్మనీ నాశనమగునని చర్చిలు తలపవచ్చును. కాని బ్రిటను నాశనమగునని నాకురూఢిగ తెలియును.

### బ్రిటనుకు విజ్ఞప్తి

ఈసమయమునవిచక్షణతోను. పరేంగిత జ్ఞానముతోను ప్రవర్తింపవలయునని బ్రిటను ప్రజలకు విజ్ఞప్తి గావించుట నాధర్మమని తలచుచున్నాను. ఇట్టివిజ్ఞప్తి గావించుటకు అర్హతగలస్థితిలో నున్నానని తలచుచున్నాను నేనుపరాజితుడనై, దయజూపవలెనని ఈవిజ్ఞప్తి గావించుటలేదు. సంగ్రామమున విజయముగాంచిన పిమ్మట విచక్షణతో ప్రవర్తింపవలయునని ప్రతిపక్షులకు విజ్ఞప్తి గావించుచున్నాను. ఈయుద్ధము సాగింపవలసిన అవసరము నాకు కనుపడుటలేదు. ఈయుద్ధమువల్ల కలుగునష్టములు బాధలు తలచుకొనిన నాకువిచారముకలుగుచున్నది. జర్మని ప్రజలకు కలుగనష్టమును తొలగింపవలయుననియే నాఅభిలాష ఒకతరములో రెండుపర్యాయములు బ్రిటను జర్మనిపై యుద్ధముప్రారంభించినది. శత్రువుతో పోరాటముసలిపి ఓడగొట్టి కవిలీక్చుకొనవలయునని లక్షలకొలది జర్మనులు ఆతురపడుచున్నారు. ఇందులకై తమసర్వస్వమును ధారవోసి గొప్పత్యాగమును ప్రకటింప ఉత్సాహపడుచున్న మాతలతోను, యువతులతోను జర్మని

(౪వ పేజీ చూడుడు)

## సిరిసిల్ల

### కాలమాన పరిస్థితులు

సిరిసిల్ల తాలూకాలోని అన్ని గ్రామాదులలోను ఇంతవరకు స్వల్పవర్షము కురిసినది. మృగశిర నగము పాదములో వర్షము కురిసినందున మక్కలు జొన్నలు విత్తబడినవి. పునాస ప్రత్తి, పెసరగుడ విత్తబడెనుగాని యీపైరు కీటకముల కాహుతియగుచున్నది.

### మాగాణి

ఈసంవత్సరము పెద్దవర్షము కురియనందున చెఱువులకు, కుంటలకు నీరేమాత్రము రాలేదు. మానేరు కాలువలున్న గ్రామములలో స్వల్పముగ మాగాణి సేద్యమగుచున్నది. అదిగూడ ఎండిపోవుచున్నది. వర్షము కురియునను ఆశతో పోగి నారుపోసుకున్న వారినారు పెరిగిపోవుచున్నది. రైతులు నిరాశ జెందుచున్నారు.

### కీటకబాధ

కంబళిపురుగు, నిక్కడుపురుగు, మిడుతపురుగులు పునాసను నాశనముచేయుచున్నవి, మాగాణి అసలేలేదు రైతుల జీవనోపాయ మెట్లు. కటువుకాలముపోయి కఱువుకాలము సమీపించుచున్నట్లున్నది.

### పశువ్యాధి

చిటుకురోగముచే పెక్కు గొర్రెలు చచ్చిపోవుచున్నవి.

### మేతకరువు

సిరిసిల్ల తాలూకాలోని అన్ని గ్రామాలలో పశువులకు మేతలేక రైతులుదుఃఖించుచున్నారు. దివమిల్ల గడ్డివేళ్లు త్రవ్వకవచ్చి నాగటిఎద్లకువేసి మన్నుకొనుచున్నారు. అరణ్యప్రదేశములయందు మేకలకువేసి పశువుల కాపాడుకొనుచున్నారు.

### కరువు

ఈతాలూకాకు కటువుకాలముచే కావలసినంత ధాన్యములేనందున ఇతరదేశములనుంచి మోటర్లమీద ధాన్యము వచ్చుచున్నది. ఋణము లోపల ఖర్చగుచున్నది.

### త్రోవలు

సిరిసిల్లతాలూకాలో చాలగ్రామాదులత్రోవలు చాల అధ్వాన్నముగనున్నవి. వర్షకాలము ప్రయాణము మహాఘోరమైయున్నది.





## సంతలో సనాతనుల సంతకములు

తా॥ కామారెడ్డిలోచేరిన బిక్కనూరులో ప్రతిఆదివారము సంతజరుగును. యిట్టిసంతలో పల్లెటూర్ల ప్రజలు గుంపులుగుంపులుగా ప్రవేశింతురు. తా. ౨-౧౦-౪౯ ఆదివారమునాటిసంతలో సనాతనధర్మ ప్రచారకులగు శ్రీమాన్ నరసింహాచారి (నందిగామ నివాసులు) శ్రీ బూర్గువిఠల్ గారు (పాతూరు నివాసులు) వీరలు ప్రవేశించి శారదాబిల్లుకు (బాల్యవివాహనిషేధచట్టానికి) ప్రతికూలముగ సంతకములు తీసుకొనుచుండిరి. ఇంతలో మేముకొందరము యిట్టిసమయమున చేరి ఆపండితులతో ప్రశ్నింపగా తగుసమాధానపరచకపోయిరి. ఇట్టిసంతలో ఒక కల్లుదుకాణముకూడ గలదు. కల్లుత్రాగి మత్తెక్కిపోవుచున్నవారితోను యింకను తదితరులతోను సంతకములు పుచ్చుకొని వెడలిపోయిరి.

అయ్యో! ఇట్టి వింతసంతకములతో ఎంతలాభముకలుగునో పాఠకులే యోచించగలరు.

(గమనిక:-ఈవార్త క్రింద ౧౫నుండి సంతకములుచేసి పంపినారు. గో. ప.)

## సిరిసిల్లాతాలూకా గ్రామ ప్రముఖులకొక మనవి

ప్రస్తుతకాలము ననుసరించియు, పురాతనవిషయములు విపులముగా వర్ణించుచు "సిరిసిల్లతాలూకాచరిత్ర" వ్రాయబూనితిని. సిరిసిల్లతాలూకగురు గ్రామాదులవారు తమతమ గ్రామిచరిత్ర నోట్సు వ్రాసి సంసిద్ధముగనుంచిన నేను జారాచేయుచువచ్చి వృద్ధులనడిగి, నోట్సుసహాయముచే చరిత్ర సిద్ధపరుచగలను. కావున చరిత్రాభిమానులు దయచేసి నేచేయబూనుకార్యమునకు తోడ్పడెదరని నమ్ముచున్నాను

యస్. భూపతిరెడ్డి
లక్ష్మీపురము తా॥ సిరిసిల్ల

## హనుమకొండలో పాఠశాలకూలుట-ప్రమాదాలు కలుగుట

హనుమకొండ ... లోని ఒకతరగతి మిడ్లువర్నాక్యులర్ కలన కూలిపడినది, అందువల్ల ఒక బాలిక చనిపోయెను. ఏడెనిమిదిమంది బాలికలకు దెబ్బలు తగిలెను. ఇది ప్రభుత్వమువారికి చాలా విషాదము కలిగించినదిఅని ప్రభుత్వ ప్రకటన శాఖవారు తెలుపుచున్నారు. ఈ ప్రమాదము 15-10-49 గురువారమునాడు సంభవించినది. దెబ్బలుతగిలినవారిలో ఒక బాలిక ఆసుపత్రిలో చచ్చెను. తక్కినవారు బాగుపడుచున్నారు. ప్రధానమంత్రిగారు ప్రభుత్వమునుండి దెబ్బలుతగిలిన బాలికల చికిత్సయున్ను వారిని గమించినవారికిన్ని ఇనాములిచ్చుటకున్ను 500రూ॥ యిప్పించినారు. విద్యాశాఖాధికారి యొకరు ఆవెనమే అచ్చటికిపోయినారు. ప్రధాన ఇంజనీయరుగారున్ను, విద్యాశాఖ నాజింగారున్ను అక్కలాన్ని చూచి వచ్చినారు. బడి ఒకవారందినాలకుగాను మూసివేసినారు. ఇంతలో వేరేబంగ్లా కిరాయకుతీసుకొనుచున్నారు. బడికిగాను ఒక కొత్తబంగ్లా కట్టించుటకై ఏర్పాట్లుజరుగుచున్నవి.

## ఖమ్మంమెట్టు

శ్రీ మందుముల నరసింగరావుగారిచే మనశాసనసభయందు ప్రవేశపెట్టబడిన, హిందూ బాల్యవివాహ నిషేధ చిత్తుచట్టమును గూర్చి ప్రభుత్వమువారు ప్రజాభిప్రాయమునుగోరుచున్నారు.

ఖమ్మంమెట్టు హిందూపౌరుల అభిప్రాయమును నివేదించుటకు, అర్వపల్లివారి మోక్షలక్ష్మీవిలాససత్రమునందు, శ్రీయుత ఆకుల పూర్ణానందంగారి అధ్యక్షతను ఆషాఢబగంలు (29-7-49) న సాయంత్రం ౭గంటలకు సభజరుగును.

ఇట్లు
ఖమ్మంమెట్టు, ది 19-7-40 } కోదాటి నారాయణరావు, పసుమర్తి వెంకటలక్ష్మయ్య.

# గోలకొండపత్రిక

విక్రమనామసం॥ర ఆషాఢ బ॥ ౬

గురువారము


## ప్రజాసంస్థలు--ప్రభుత్వోద్యోగులు

ఏ దేశములోనైనాసరే ప్రజలహితార్థమై సంఘాలు ఏర్పడినవంటే అవి పారమార్థిక దృష్టితోనే ఏర్పడినవన్నమాట. ప్రభుత్వము ప్రజలకొరకై పనిచేయుచున్నదంటే అది ప్రజలవద్ద జీతముతీసికొని పనిచేయుచున్నది. ప్రజలవద్ద నానావిధాల పన్నులను వసూలుచేయుదురు. ఆపన్నును ప్రజలకొరకై వ్యయము చేయుదురు. అట్టివ్యయానికిగాను ఉద్యోగులను జీతాలిచ్చి ఏర్పాటుచేయుదురు. ప్రజాహితసంస్థలను నడుపువారికి జీతాలులేవు. భత్యాలులేవు, సవారీలులేవు, అలవెన్సులులేవు. సెలవులులేవు, సర్కారీ ఇండ్లులేవు, సర్కారీనౌకర్లులేరు, కచ్చేరీ చేయుటకు బంగ్లాలులేవు. వారు మితజీవులు. తిరిపము చందాలవసూలుచేసి తమ అమూల్యకాలాన్ని వినియోగించి జీతములేనిబంట్లవలె పనిచేయుదురు. అయితే వీరిని శ్రమవహించమని యెవ్వరుకోరినారు? తమపనులు తాము చూచుకొనగూడదా? వీరేమైన్నా "బేకార్ పండితులా?" అని యెవ్వరైన వితండవాదులు ప్రశ్నించవచ్చును. ఈలోకోపకారులే లేకుండిన ప్రపంచము అంధకారమయమైయుండును. మానవస్వాతంత్ర్యమునకై ఉదారచరితులు తమకాలాన్ని,తమ ఆరోగ్యాన్ని, తమధనాన్ని, తమప్రాణాలను, తమ కుటుంబాలను అన్నింటిని బలియిచ్చినట్లు వేనవేలు నిదర్శనాలు ప్రతిదేశములో ప్రతిశతాబ్దిలో మనకులభించినవి.

ప్రభుత్వముచేయుపనికి ప్రజాహితసంస్థలు ఉపాంగములు. ప్రభుత్వము మంచి పనినిచేసినా ఈసంస్థలు వాటికి గొప్ప సహాయముచేయునవై యుండును. ప్రభుత్వము తప్పుదారిలోపడితే ఇవివెంటబడి సరియైన మార్గానికి తీసికొనివచ్చును. ఇది ప్రజాహితసంస్థల ప్రయోజనము.

ఉదార ప్రభుత్వాలలో, ప్రజాయత్త ప్రభుత్వాలలో (Democracies) ప్రజాసంస్థలకు మంచిగౌరవము, పలుకుబడి కలదు. అమెరికా, ఇంగ్లెండు, ఫ్రాన్సు, స్విట్జర్లెండు వంటిదేశాలలో సంఘస్థాపన స్వాతంత్ర్యము (Freedom of association) అనునది ప్రాథమికస్వత్వసూత్రములలో ముఖ్యమైనది. అది ధారాళముగా సందు వర్తించుచున్నది. మన హిందూస్థానములో అనేకదేశీయ సంస్థానాలలో ప్రజాసంఘాలు విక్రయపత్రాలవలె రిజిస్టరీచేయించుకొనవలసి యుండును. వాటి కి సంస్థానముదర్బారు అనుమతి కావలసియుండును అనుమతిలేనిది స్థాపించుటకు వీలులేదు. అయితే మన హైద్రాబాదు రాష్ట్రములో యీ కఠినశాసనములేదు. (స్టేటుకాంగ్రెసువారి గ్రహచారమేమో కాని అదొక్కటే పసందుకాని సంస్థయయ్యెను. ఎవ్వరి బోధకలిగెనో యేమో పేరుకూడా మార్చుకొని నేషనల్ కాన్ఫరెన్సు అనుపేరు తగిలించుకొనిరి. పంబిపోమయాజికథవలె అక్కడికిని దానికి మోక్షము కలుగకపోయెను.)

మన ప్రభుత్వమువారిలో బహుకాలమునుండి ఒక ప్రశంసనీయమగు ఆచారమును కనుగొనుచూ ఉన్నాము. ప్రజల మొరలు బహిర్గతమైన వాటిని వీలైనంత తొందరగా విచారించి వీలైనంతవరకు సవరణ చేయుచున్నారు. ఈవిషయములో ప్రజాహితసంస్థలు ప్రభుత్వానికి చాలాతోడ్పడినవి. ఇట్టి తోడ్పాటుచేసిన వాటిలో ముఖ్యమైనట్టిదిఆంధ్రమహాసభ. అందుచేతనే రెండుమాసాలకు పూర్వము మహిబూబునగరులో జరిగిన ఇత్తెహాదు మహాసభయొక్క ఆహ్వాన సంఘాధ్యక్షుడు "ఈ ఆంధ్రమహాసభ ప్రభుత్వమువారితో సరిసమానముగా పత్రవ్యవహారము చేయుచున్నది." అని వాపోయెను."ఇంతటి అపచారమా" అని చకితుడైపోయెను.

ఇంతలోనే మనప్రభుత్వమువారు ఒక ఆజ్ఞను ప్రకటించినారు. ఆయాజ్ఞ గష్తీ సంఖ్య ౪ తేది ౮ తీరు ౧౩౪౯ నాటిదట. అది ౯ మెహరేవరు ౧౩౪౯ నాడు అనగా రెండునెలలతర్వాతజరీదాలో ప్రకటింపబడెనట. అందలి విషయాలివిఅని ముషీరెదక్కనులో ఇట్లువ్రాసినారు.

> "......... బాబెహుకూమతుకార్యాలయమునుండి ప్రభుత్వకచ్చేరీలకు తెలుపుట యేమనగా వారికి ప్రజాసంస్థలనుండి మరియు తదితరములనుండి తీర్మానాలు విచారణలు వచ్చినట్లైతే తమకు సంబంధించిన శాఖామంత్రి సెలవులేనిది ఏమిన్నీ పత్రవ్యవహారము చేయగూడదు. ఈ విధముగా అమలు చేయగలరు. మరియు గౌరవనీయమైన బాబెహుకూమతువారి యీ నిర్ణయముక్రింది కచ్చేరీలన్నింటికిని తెలుపడమైనది-"

ఈ యాజ్ఞయొక్క యుద్దేశమేమో దాని కారణమేమో తెలుపలేదు. చిన్న చిన్న చేతిక్రింది అధికారులు సహజముగా తమకు ఎవరుగాని వ్రాసిన జాబులకువిచారణలకును జవాబియ్యజాలరు.కానిపై అధికారులు అనగా శాఖాధికారులు, నాజిములు, జిల్లాతాలూక్దార్లు, ప్రభుత్వకార్యదర్శులు ఇట్టివారు అవసరమగు విచారణలకు సకాలములో ప్రత్యుత్తరమిచ్చుటలో కొంత యిబ్బందియేయుండవచ్చును. దానివలన లాభముకూడకలదు. ప్రజలకు వెంటవెంట తమమొరలకు సమాధానము దొరకుచుండును.

మనరాష్ట్రశాసనసభలో ప్రజాప్రతినిధులు ప్రశ్నలువేసి ప్రభుత్వమునుండి సమాధానాలుపొందు ఆచారములేదు. అందుచేతకూడ రాష్ట్రములోని జిల్లాలలోను తాలూకాలలోను అధికారులవిమర్శించి ప్రభుత్వముదృష్టికి శాసనసభాద్వారా అందలిప్రశ్నోత్తరముల ద్వారా వెల్లడించుటకు అవకాశము లేకపోయెను. అందుచేత ప్రజాహితసంస్థలు తమకాంక్షలను తీర్మానములద్వారా సంబంధముకల అధికారులకు పంపితే వాటికి ప్రత్యుత్తరమువచ్చుటలో ఆలస్యమైనలేక మంత్రివరకుపోయి నిదానముగా జవాబుదొరికిన అదంతగా తృప్తికరముగానుండదు.

బ్రిటిషు ఇండియాలో ఇట్టియాజ్ఞ ఉండినట్లు మేము ఎరుగము. జిల్లాకలెక్టర్లతో ప్రజలెవ్వరైనను పత్రవ్యవహారము చేసిన వీలైనంతవరకు జాబులందిన మూడుదినాలలోనే జవాబిచ్చుదురని మేము వినియున్నాము. మనరాష్ట్రములో రైతులు, వ్యవహారస్థులు, ఏ కచ్చేరీకిపోయినను గుమాస్తాలను కట్టుకొని వారికి సలాములుకొట్టి అవసరమైనవారిని ఏదో విధంగా తృప్తి పరచి, స్తోత్రముచేసి, తమవ్యవహారములను ముందుకు సాగించుకొనిపోవుచుండుటను విశేషముగా వినుచుందుము. ఇట్టి చిన్న విషయములలో ప్రభుత్వమువారికి జోక్యము లేకున్నను, వారికి తెలియకున్నను, జనులుమాత్రము ప్రభుత్వమువారినే విమర్శించుచుందురు. కావున మా అభిప్రాయములో ఇట్టియిబ్బందులను తొలగించుటకై ప్రతికచ్చేరీలోను ఒకవిచారణశాఖ, ఒకవిచారణాధికారి, ఏర్పాటుకావలెను. వచ్చినవారు-వారు గొంగడివారుకానీ ట్వీడ్‌సూటువారుకానీ- సమానగౌరవముతోకూర్చుండుటకు ఒక ప్రత్యేకగది ఏర్పాటుకావలెను. అట్టివారి విచారణలు ప్రత్యేకాధికారి కచ్చేరీకాలములో అన్నిగంటలలోను అదేపనిగా విని విచారించి సమాధానముచెప్పి సహాయపడవలెను. బాగాత్ కచ్చేరీలో తురాబలీగారు తాలూక్దారుగానున్నకాలములో ఇట్టి ఏర్పాటుండెనని విని మేమిదివర కొకమారు ప్రశంసించియుంటిమి. అంత మాత్రపు ఏర్పాటైనను ప్రతికచ్చేరీలో — చిన్న వాటిలోను పెద్దవాటిలోను— ఉండవలెను. అవి నామకార్థముగాఉండుటకాక నిజముగా అట్టివిధానమువలన ప్రజలకు జవానులవలనగాని, గుమస్తాలవలనగాని క్రింది అధికారులవలనగాని, తుదకు ఆ కచ్చేరీపెద్దవలనకాని యేమియు అవమానములు, అడ్డంకులు, ఆక్షేపణములు, అవరోధములు, కలుగక లాభముకలుగుట ప్రధానము.

కావున ప్రభుత్వమువారు తామిటీవల కావించిన నిషేధకాజ్ఞను గురించి పునరాలోచించి తమ అభిప్రాయమేమో విశదపరచి ప్రజాహిత సంస్థలును ప్రజలును తమ తమ యిబ్బందులను, కోరికలను, తెలుపుకొనిన ఎవ్వరికి తెలుపుకొనవలెను? తెలుపుకొనిన ఎంతకాలములో జవాబు దొరకవలెను? అనువిషయాలను స్పష్టపరిచితే బాగుండునని మనవి చేసుకొనుచున్నాము.

---

## సైన్యములో క్రొత్తవారి భర్తీ

నిజాంప్రభుత్వమువారు రిజర్వుసైన్య మొకటి సిద్ధముచేయనిశ్చయించినారు రిగులర్ ఫోర్సు హెడ్ క్వార్టర్ హైద్రాబాదు అను స్థలములో క్రొత్తగాచేరువారిని చేర్చుకొనుట ఒకకార్యాలయము ఏర్పాటుచేయబడినది. అభ్యర్థులు స్వయము ౧ ఆగస్టు ౪౦ నాడు ప్రొద్దున ౯-౩౦ గంటలకు అచ్చటికి పోవలెను. మొదట ౩౫ మందిని తీసుకొందురు మెట్రికులేషన్ లేక కాలేజీ విద్యార్థులే పోవలెను. ౧౮—౨౦ ఏండ్లమధ్యనుండవలెను. ముల్కీలుగానుండవలెను.

---

## "అల్ ఆజం"

యాద్గిరులోని అంజుమనె ముస్లిం నౌజవాను సంఘమువారు ప్రభుత్వమువారిచే ఆపబడిన అల్ అజం పత్రికకు మరల సెలవియ్యవలెననియు ఆ పత్రికను తాము చాలా గౌరవించువారనియు దాని అస్తిత్వము హైద్రాబాదురాష్ట్రానికి చాలా అవసరమనియు తీర్మానించిరి.

(అ. న్యూ)

---

## ఆంధ్ర యువజనసమితి

(హైదరాబాదు దక్షిణ)

పైసమితి వార్షికోత్సవ సందర్భమున ఈదిగువ కార్యక్రమము ఏర్పాటుచేయబడినది.

౧. వక్తృత్వ పోటి

స్త్రీపురుషు లెల్లరును పాల్గొనవచ్చును. రెడ్డివసతిగృహములో శుక్రవారము ౨౫ జూలై నాడు సాయంత్రము ఆరుగంటలకు ఆచార్య విద్వాన్ శ్రీసరిపల్లి విశ్వనాథశాస్త్రి ఎం. ఏ.గారి అధ్యక్షతన జరుగును. విషయము సభలోనే ప్రకటింపబడును, పాల్గొనువారు తమనామములను ౨౪వజూలైవరకు కార్యదర్శివద్దకు పంపవలెను.

౨. సార్వజనికసభ

రెడ్డివసతిగృహములో శుక్రవారము ౨౬ వ జూలైనాడు సాయంత్రముఆరుగంటలకు విఖ్యాత ఆంధ్రనాయకులగు శ్రీయుత బూర్గుల రామకిష్ణరావు బి.ఏ.ఎల్.ఎల్.బి, గారి యధ్యక్షతన జరుగును. ఆంధ్రవాఙ్మయ జాతీయ, చారిత్రక, సాంఘికాది విషయములపై ఆంధ్రప్రముఖులు ఉపన్యసించెదరు.

౩- నాటకప్రదర్శనము

శనివారము ౨౭వజూలై సాయంత్రము౭—౩౦. లకు రెడ్డివసతిగృహములో,

౪- మహాసభ-సాంవత్సరికఎన్నికలు

ఆదివారము ౨౮వ జూలైనాడు సాయంత్రము ౫—౩౦గం. శ్రీసదనములో-సభ్యులకుమాత్రమే. ఆంధ్రసోదరసోదరీమణులెల్లరును పాల్గొన ప్రార్థితులు.

ను. చెన్నారెడ్డి
(కార్యదర్శి)

---

## హైద్రాబాదు నాణెములు

హైదరాబాదు (దక్కను)షహరేవరు౧౫ ప్రభుత్వ ప్రకటనశాఖవారిట్లు తెలుపుచున్నారు.

బ్రిటిషిండియాలో లేనిపోని వదంతులు పుట్టుటచేత జనులు నోట్లను వదలుకొని నగదురూపాయీలను కూడబెట్టుట మొదలుపెట్టినందున అచ్చట కొన్ని నిబంధనలు చేయవలసివచ్చెను. అచ్చట ప్రభుత్వమువారు నోట్లకు సంపూర్ణముగా బంగారు నిలువపెట్టియున్నారు,

హైద్రాబాదుకు సంబంధించినంతవరకు బ్రిటిషండియాచేసినట్టి శాసనము ఇచ్చట చేయవలసిన అవసరము కనపడలేదు. ఇచ్చటనోట్లకు దగినంత పైకమున్నది. టప్పాబెంకులలోని పైకాని కేమిన్నీ లోపములేదు. పైగా యీరెండునెలలో ఎక్కువమొత్తాలు జమాఅయినవి. బెంకులనుండికూడా ఎక్కువద్రవ్యము తీసుకొనబడలేదు. అయినా జనులు వెండినాణెములను నోట్లకుబదులుగా పసందుచేయుటకు మొదలుపెట్టినారు. ఒకటిరెండంకాలు సర్కారుదృష్టికివచ్చినవి. సాధారణజనులకు నోట్లపద్ధతి సరిగా తెలియనట్లున్నది. ప్రతినోటుపైన,సర్కారువారు "నేను ఈనోటును తెచ్చినవాడు అడిగినప్పుడు" పైకమిచ్చుటకు వాగ్దత్తముచేయుచున్నాను. అని ముద్రించినారు చూడండి. ఈవాగ్దత్తము ఉల్లిబొల్లిమాటకాదు ప్రతినోటుకు సరియైన వెండినాణెములను సర్కారువారు జమాఉంచినారు. ఇప్పుడు రాష్ట్రములో మొత్తమునోట్లు ౧౭కోట్ల చిల్లరరూపాయీలవి చలామణిలోనున్నవి అందుకుగాను ౧౨కోట్లచిల్లర వెండినాణెములు బెంకులోనున్నవి. తక్కినవి ఇండియాగవర్నమెంటు సెక్యూరిటీలలో నుంచినారు పైఅంశమును బట్టిచూడగా మననోట్లకేమిన్ని లోపముగాని, భయముకానిలేదు. ఈదేశములో ఇంకా బెంకుపద్ధతి బాల్యదశలో ఉన్నది. దానికి కరెన్సీనోట్లుమంచిసహాయకారి. ను, ఘు. న. ప్రభువుగారియొక్క ప్రతిపౌరుడును ఆబద్ధపువదంతులను నవరోధించిజనులకు యథార్థము తెలుపవలెను. మూర్ఖతచేత జనులు వెండినాణెములను కూడబెట్టి బెంకులనుండి ద్రవ్యముతీసుకొనిపోయి యింటిలోదాచుకొన్న నడ్డీనష్టమున్ను తమకుచాలా యిబ్బందులనున్ను తెచ్చుకొనువారగుదురు.

---

## భారతమాతపూజ

(స్వ- వి-)

హైదరాబాదు(దక్కను)షహరేవరు ౧౪

ఈవిక్రమసం॥ఆషాఢబ ౧౦ సోమవారముఉదయము మొదలుకొని సాయంత్రమువరకు భారతమాత మొదలైనదేవతలకు సాత్వికపూజలు ఇక్కడికి పడమటనున్న నారసింహాపేటలో జరుగగలవు. రాత్రి భజనలు, జాగరణకాగలదు. మరునాడుదయము ౯గం-లకు అన్నదానముకాగలదు. అందరునువచ్చి పాల్గొనటకై ప్రార్థన.

ఇట్లు విన్నవించు

ఆంజనేయ భక్తసమాజ కార్యదర్శి

రాఘవరెడ్డి

---

## గోర్ఖాలను తొలగించుటకై తాలూక్దారు ఆజ్ఞ

వరంగల్లు. షహరేవరు౧౪,

ఈ వరంగల్‌పట్టణములో పోలీసువారు పంజాసాహాలు చేయుచునేయున్నారు. యథాప్రకారము చిన్నచిన్న చిల్లరదొంగతనాలు జరుగుచునేయున్నవి. ఆటూ,ఇటూ తిరుగలేకను బాధపడలేకను పోలీసేపోయినదని చిల్లర దొంగతనాలు చెప్పకుండానున్నారు కూడాను కొందరు వ్యక్తులు. ఈయూరికి కొందరు గోర్ఖావ్యక్తులు కొన్నినెలలక్రితం ఉదరపోషణార్థమై వచ్చినారు. వారలను కొమరవల్లిలింగన్న, బజ్జూరిరామకిష్టం, సిద్దంసెట్టి లింగన్న, ముస్తాలరాజమౌళి. మోడరణాకేఫుహోటల్ ప్రొప్రైటరు సీతారామయ్య. యింకొకొందరు సాహుకార్లు తమతమ దుకాణములను రాత్రిల్లు కావలి కాయుటకు, యింకొ ఆకారపు నరసింగంగారి బోటి పెద్దపెద్దవారు గోర్ఖాలను పెట్టుకున్నారు. గోర్ఖాలు బ్రిటిషిండియాలోను, స్వదేశి సంస్థానములలోను ఈ హైద్రాబాదు సికింద్రాబాదులలోకూడానున్నారుకాని-ఏమికో పోలీసు మొహతెమిం సాహెబుగారి దృష్టిపడి గోర్ఖాలను పిలిపించి మిమ్ములనెవరెవరుపెట్టుకున్నారని వారల స్టేటుమెంటు తీసుకుని సదరు సాహుకార్లందరకు తాలూక్దారు కచేరికి హాజరుకావలసినదని సమనులను జారీ చేయించినారు. ఈ సాహుకార్లందరు కచేరికి హాజరైనారుకాని శ్రీవారు లేనందున తిరుగమూడు రోజులకు వెళ్ళినారు. అంతట శ్రీవారు యిట్లాసెలవిచ్చినారు. "ఈగోర్ఖాలు గైర్ ముల్కీలవుటవల్లను, మీరు వీరలను పెట్టుకొనుటవల్లను ప్రజలకుగాని ప్రభుత్వమునకుగాని యీగోర్ఖాలు హాని గలుగకే సేయెడల నెవరు జవాబుదారిఅని శ్రీవారు అడుగుటతోనే, సమ్మోహితులయి యీపెద్దపెద్ద సాహుకార్లందరును నోరుమెదల్పలేదు! ఒకవేళనవరైనా వీరలను పెట్టుకొనే యుద్దేశమేయుండేయెడల యెట్లా ! ఆగడంలు జరిగినను మేమే పూచీదారులమని పూచీపడేటియడ ప్రభుత్వం వారు అనుమతియిస్తేగాని పెట్టుకోకూడదు. అని అన్నారు! పాపము! గత్యంతరములేక గోర్ఖాలు యీయూరినుండి వెడలిపోయినారు.

(ఒకవిలేఖరి)

---

## రెండులక్షల ముస్లిం సైన్యము

౧౧-౧౦-౪౯ఫ.నాడు "అంజుమనే నౌజవాను"వారు ఔరంగాబాదులో ఒక అసాధారణసభచేసి ఏకవాక్యంగా ఈక్రింది తీర్మానమును కావించిరి.

> "ఔరంగాబాదు అంజుమనే నౌజవానుసభవారు తమగౌరవనీయమైన ప్రభుత్వముతో వినయపూర్వకముగా ఇట్లని విజ్ఞప్తి చేసుకొనుచున్నారు, హైద్రాబాదు ప్రభుత్వమువారు త్వరితాతిత్వరితముగా ఒక ముస్లింసహాయక ఫౌజును సిద్ధముచేయు విషయమునుగురించి ఆలోచించవలెను. ఈసైన్యము కనిష్ఠములో కనిష్ఠముగా రెండులక్షలదిగా నుండవలెను. అందు ముస్లింనవయువకులు చేరియుండవలెను. వారికి సైన్యశిక్షణ, నియమములు నేర్పవలెను. వారు అట్లు శిక్షపొందినతర్వాత ప్రాణాగొడ్డమను సేవలను "మమ్లకతే ఇస్లామియా అసఫియా" యొక్క సంరక్షణకై బాధ్యులైనవారుగా నుండవలెను"

(అ. న్యూ)

---

రోము, జూలై ౨౦.

హిట్లరు ఉపన్యాసముపై ఇటలీ న్యూస్ ఏజెన్సీ ఈక్రింది విమర్శ ప్రకటించినది. ఇది గొప్ప చారిత్రాత్మకమగు ప్రకటన యిందు నిగ్రహము దూరదృష్టి కనుపడుచున్నది. విజయము పొందిన యోధుడు గొప్ప ప్రతిభగలిగిన రాజతంత్రజ్ఞుడు చెప్పినమాటలివి. ఇటలీవిషయమై హిట్లరుగావించిన ప్రస్తావనకు ఇటలీప్రజలు కృతజ్ఞులుగ నుండవలెను.

## నిరౌషధ చికిత్స

డాక్టర్ సి. ఆర్. రామకృష్ణారెడ్డి వర్మ

పుల్లని ఫలములు దినువారికి (బ్లడ్ ప్రెషర్) అర్థాత్ "రక్తముఅణగుట అనువ్యాధి జన్మాంతముదనుక కానేరదు. నిమ్మపండ్లు, చింతపండు జానిమ్మవిత్తులు! పుల్లని పెరుగు మాదినిమ్మ, చకోత్ర, సంత్రా, నారింజపండ్లు, ముద్దగువాని సేవ్యాపముగానయినను భోజనముతోడ యథార్థస్థితిలో లేక పచ్చిది అథవా ఊరుగాయరూపమున దినుచుండుటవలన ప్రస్తుత నాగరికతాజన్యమహాభయంకరవ్యాధి కల్గకుండును. చిత్తాజ దినువారికి బహుమూత్రరోగము, మరియు నపుంసకత్వము కల్గనేరదు. యీవిధముగ మూత్రకృచ్ఛ్రము, మూత్రపిండమందలి నొప్పివంటి భయానకవ్యాధులు ఋతువులందలి పైత్తనిదోషకాయలు, ఖర్బూజ, మరియు తర్బూజ, బాగుగాసేవించువారిని సమీపించనేరజాలవు. వీటిని సేవించుటవలన శరీరమందలి చెడుపదార్థములు వెడలిపోవును. విత్తనములు పెత్తగానున్న దోస, మరియు మల్లొసకాయలను విత్తనములతోసహా బాగుగానమిలి భోజనముతో లేక భోజనముచేసినపిమ్మట ప్రతిదినమువినుట ... రోగములనుండి కాపాడు ... ...సచారము

## రైల్వే ప్రత్యేకోద్యోగులు

హైదరాబాదు(దక్కన్) షహరేవరు 15.

ప్రభుత్వప్రకటన శాఖవారిట్లు తెలుపుచున్నారు.

ఉజూలైనాటి ఇండియాగజెటులోని నియమాలప్రకారము స్పెషల్‌తరగతి రైల్వే అప్రెంటిసులకుగాను ౫మందిని బట్టల ఫ్యాక్టరీల ఆర్డినెన్సులో 10మందిని ఉద్యోగులనుగా నియమింతురు. అభిలాషులు 15 ఆగస్టు40లోగా విజ్ఞప్తులను పంపుకోవలెను. పూర్తివివరాలకు కార్యదర్శి ఫెడరల్ పబ్లిసుసర్వీస్‌కమిషన్, డిల్లీఅని వ్రాసి తెలుపుకొనవలెను.

—

భట్టిలోవేచిన సెనగలను నమలుచుండుటవలన, అన్నకోశము, ప్రేవులు, మరియు నోటిలోని దుర్గంధము మరియు మలబద్ధము నివారణమగును. బహుమూత్ర రోగముయొక్క భయముండదు. శాకాహారులను చర్మవ్యాధులు బాధింపవు. పెరుగు, మరియు మజ్జిగ త్రాగువారికి "సంగ్రహణి" మరియు "విషజ్వరము" (టైఫాయిడ్)యొక్క విచారముండదు. మినుములు, పెసల్లు, సెనగలు, బటానీలు మొదలగువానిని బాగుగా దినువారికి సంతానము చాలగును.

ఎవరిదైనిక ఆహారములో గోధుమరొట్టె, స్వ... ...లేక అన్న, పెరుగులేక చల్ల, అ... ...వారు



## అసత్యప్రచారఖండనము

సిద్ధిపేట, ౧౦-౧-౪౯ ఫ.

గోలకొండపత్రిక సంపుటము ౧౫ సంచిక ౭౦, తేది ౫-౧౦-౪౯ ఫ. గురువారమునాడు "సిద్దిపేట సనాతన ధర్మప్రచారము" అనుశీర్షికతో ప్రకటింపబడినవార్తయందు "కన్యావివాహ నిషేధ ప్రతిఘటనసభలో ౨ వందల సభ్యులలో ఒక్కరుగూడ వ్యతిరేకముగ ఓటు యివ్వలేదని" వ్రాసినదిశుద్ధఅబద్ధము.

"పండిత చక్రవర్తి" ఉపన్యాసారంభములో కొనిబంధనలు ఏర్పాటుచేసి సభనునిర్బంధములో పెట్టినారు. "నేనుచెప్పినదివినవలెను. ప్రశ్నలుచేయకూడదు, యిదినాదుకాణము యిదినాసరకు నాయిష్టమువచ్చినట్లుచెప్పగలను, మీకిష్టమైన యుండుడు, లేనిచో వెళ్లవచ్చునని అప్రతిహతముగానాజ్ఞాపించిరి. అపుడేసభలోనుండి వెళ్లడానికి కొందరుద్యుక్తులైరి. కానిఏమిచెప్పుదురో వినక వెళ్లినలాభములేదని కూర్చుండిరి. ప్రశ్నలావేయకూడదాయెను సమాధానమా మొదటికేసున్న. ఈరీతిగాముగిసినసభను, ఏకగ్రీవముగా ఆమోదించినారని వ్రాసినవ్రాత పసిపిల్లల ఆటవలెనున్నది.

రెండవది మీరుగ్రహించిన సంతకములు, శ్రీమంతులవాశ్రయించి వారిఅధికారప్రాబల్యమున, చేతిక్రిందివారిచే పెట్టించిరి. పాపము! పెట్టక ఏమిచేయగలరు. ధనాఢ్యులేదిచెప్పినఅదివినవలెను. వారినిరేమిఅనడానికి అధికారములేదాయెను. వారికేమిఆగ్రహమువచ్చునోయను భయమొకవంకబీడించుచుండ "అన్యథాశరణంనాస్తి"యని మిన్నకుండినవారలైరి.

## దొంగసారాయిభట్టీలు

గద్వాల సంస్థానము

ఈసంస్థానములోని పర్మాల జాగీరుగ్రామ ... ౨ షహరేవరు ౧౩౪౯ ఫ. నాడు ఆ ...గాచేయగా సారాయిభట్టీలుదొరికి ...లో సారాయికుండలు నిండు ...౨డ్లలో నిండుసీసాలు ... మొత్తంసారాయిని క...క్యారీకారు) స్వా...ధికుల చాలా

## రెడ్ క్రాసుకు దానము

సికింద్రాబాదు సాహుకారులైన సిద్దంసెట్టి రాజేశ్వరరావుగారు ఇండియన్ రెడ్‌క్రాసునకుగాను ౫౦౦ సేర్ల తేయాకు దానముచేసినారు.

## మాస్టరు పరాజయము

విద్వాన్ శ్రీమాన్ సెమిలికొండ రంగాచార్యులుగారు కరీంనగరుతాలూకా మానుకొండూరు గ్రామములో సనాతనధర్మప్రచారముచేయుచు బాల్యవివాహనిషేధశాసనముపట్ల అసమ్మతిగల స్త్రీపురుషులనుండి సంతకములు తీసుకొనుచుండిరి. శ్రీచాడనర్సింహులుగారి దుకాణము సమీపమునందు సంతకములు తీసుకొనుచుండగా రెడ్లపునారాయణ మాస్టరు బాల్యవివాహమును దూషించుచు అనేకములైన ప్రశ్నలువేసిరి. ఆచార్యులవారు వేదశాస్త్ర ప్రమాణములను యుక్తులనుచూపించి బాల్యవివాహమందలి సుగుణములను మాపిరి. అప్పుడు మాస్టరుఅన్నియుఒప్పుకొని వావాదమును విరమించుకొనినాను అనిచెప్పెను. సభ్యులందరు బాల్యవివాహ ప్రభావమునుగుర్తించి విరివిగ సంతకములుచేసిరి.

ఇట్లు

సనాతనధర్మ మహాసభాకార్యదర్శి

## రష్యా-జర్మనీల మైత్రి చెడదు

(౨వ పేజీతరువాయి)

నిండియున్నదని నాకు తెలియును. అపజయము కలుగుననుభయముచేఁ నేనీవిధమున మాట్లాడితినని చెప్పి చర్చిలు ఈపర్యాయముకూడ నాహితమును త్రోసివేయవచ్చును. అట్లుజరిగినచో ఘోరమగు భవిష్యత్సంఘటనముల విషయమై నాకు బాధ్యతయుండదు. మనస్సాక్షికి అనుగుణ్యమగు విధమున నాధర్మమును నేను నిర్వర్తించినవాడనయ్యెదను.

కడచిన ౧౦ నెలలలో జరిగిన సంఘటనములను పర్యాలోచించిన ఈ మహాకార్యములను సాధింప భగవంతుడు మనలనీవిధముగ అనుగ్రహించినందులకు ఆశ్చర్యచకితులముకాక తప్పదు. ఈ అపత్సమయమున భగవదాశీర్వాదమునకు పాత్రులైనందులకు మ మధన్యులము. జర్మనుజాతి స్వాతంత్ర్యగౌరవముల నిలబెట్టు మహాకార్యమునకు భగవంతుడునన్ను నిమిత్తముగ వినియోగించుచున్నందులకు నేను పరవశుడనగుచున్నాను.

### హిట్లరును గోరింగుప్రశంసించుట

రీచ్‌స్టాగు సమావేశమును ముగించుచు మార్షల్‌గోరింగుగారు హిట్లరు నాయకత్వమును ప్రశంసించి, జర్మని గౌరవప్రతిష్ఠలను నిలువబెట్టినందులకు హిట్లరును అభినందించిరి.

చరిత్రాత్మకమగు ఈమహాసంగ్రామమున మొదటిఅధ్యాయము ముగిసినదనియు, హిట్లరు హితమునమసరించి బ్రిటిషువారు ఇంగితజ్ఞానముతో ప్రవర్తింపకున్న రెండవఅధ్యాయము ప్రారంభమగుననియు గోరింగుగారుచెప్పిరి.

### బ్రిటనుపై దాడి ప్రారంభమగునా?

న్యూయార్కు, జూలై ౧౯

కొలంబియా బ్రాడుకాస్టింగు కంపెని బర్లిను విశేషకు బ్రాడుకాస్టుద్వారా ఈక్రిందివార్త పంపిరి.

బర్లిను నగరమంతయు సైనికశాఖాప్రముఖులతో నిండియున్నది. ఏదోఒక గొప్పకార్యము ప్రారంభమగు సూచనలు కనుపడుచున్నవి. హిట్లరు ఉపన్యాసము ముగియగనే బ్రిటనుపై దాడిసలుప జతపరుపబడిన సేనలు తమపనిని ప్రారంభించగలవని బర్లినులోని పత్రికాప్రతినిధులు తలచుచున్నారు.

### లండను అభిప్రాయము

లండను, జూలై ౧౯

హిట్లరు ఉపన్యాసములో ప్రధాని చర్చిల్ దూషణతప్ప మరేమియులేదని ఈయుపన్యాసమును పాటింపవలసిన ఆగత్యములేదనియు అధికారవర్గమువారు అభిప్రాయపడుచున్నట్లు రూటరు రాజకీయవిలేఖరి తెలుపుచున్నాడు,

### కెనడా అభిప్రాయము

అటావ. జూలై౧౯

రాజకీయపై హిట్లరు గావించిన సూచన సరసముగలేదనియు బ్రిటిషు సామ్రాజ్యాధికారులు ఆదరింపతగినదికాదనియు కనడా ప్రముఖులు అభిప్రాయము తెలుపుచున్నారు. కేవలము తటస్థరాజ్యముల నుద్దేశించి హిట్లరు ఆమాటలు చెప్పెనని కొందరు తలచుచున్నారు చర్చిలుగారు కెనడాచేరుదురని హిట్లరు గావించిన ప్రస్తావనగురించి, చర్చిలుగారు కెనడాచేరినను కెనడానుండి యుద్ధముసాగించెదరని కొన్ని పత్రికలు వ్రాయుచున్నవి.

### బ్రిటిషు పత్రికలు గర్హించుట

లండను, జూలై౨౦

హిట్లరుచేసిన సంధిసూచనను బ్రిటిషు పత్రికలు గర్హించుచున్నవి.

లండను టైమ్సుపత్రిక ఇట్లువ్రాసెను:—

"ఆగస్టు ౧౫వతేదీలోగా ఇంగ్లండును లోబరుచుకొని సంధికొప్పుకొనునట్లు చేయుదునని వెనుక పలికిన ప్రతిజ్ఞ ఇప్పుడీ ఉపన్యాసములో లేదు. అమెరికా సంయుక్తరాష్ట్రముల విషయముగూడ ఏమియులేదు. అమెరికా సంయుక్తరాష్ట్రముల అధ్యక్షులగు రూజ్వెల్టుప్రపంచలో స్వాతంత్ర్యము నిలబెట్టుటకై తన దేశసంపదను వినియోగించు దృఢనిశ్చయమును వ్యక్తపరచెను. హిట్లరునకీసంగతి తెలిసియు ఆదేశముపిషయమై ఉపన్యాసములో ప్రస్తావించలేదు.

వాషింగ్టను, జూలై౨౦

అమెరికా సంయుక్త రాష్ట్రములలో హిట్లరు ఉపన్యాసమును గురించి ఇట్లభిప్రాయపడుచున్నారు:—ఈ ఉపన్యాసము యొక్క ప్రధానోద్దేశ్యము జర్మనులు విని సంతోషించవలెననియే.

అమెరికా సంయుక్తరాష్ట్రములలో పసిఫిక్ సముద్రతీరస్థలములు సుమారు ముప్పదియొక్కంటిలో హిట్లరుపన్యాసము వినబడకుండ ఆదేశపు రేడియో తగినచర్య గైకొనెను. నాగరికతను విధ్వంసముచేయు హిట్లరు తనతప్పులను సమర్థించుకొనుటకు చేయుప్రచారమునకు తమదేశపు రేడియో అవకాశమిచ్చుట ఉచితముకాదను వివేకము వినువారికి కలదని రేడియోవారు ప్రకటించిరి.

### అమెరికా పత్రికల వ్యాఖ్యలు

న్యూయార్కు, జూలై౨౦-

హిట్లరు ఉపన్యాసము సత్యమును మరుగుపుచ్చుటతోను కపటవాక్యములతోను నిండియున్నదనియు, బ్రిటను నిలచియుండవలయునని హిట్లరు ప్రాబల్యము ధ్వంసము కావలయుననియు న్యూయార్కు హెరాల్డుట్రిబ్యూనుపత్రిక వ్రాసినది

—

## బజారుధరలు

హైదరాబాదు(దక్కన్)షహరేవరు౧౫

ప్రభుత్వము వారు నిర్ణయముచేసిన ప్రకారము ౧౮ జులైనాడు హైదరాబాదు నగరములో ముఖ్యధాన్యము వస్తువులు ఈక్రిందిధరలకు అమ్మబడెను.

| | | |
|---|---|---|
| కిచిడి | పల్లా | ౨౧ నుండి ౨౨ |
| డిల్లిభోగాలు | ,, | ౧౯౪ |
| బానకరాం | ,, | ౧౯౪ నుండి ౨౦౪ |
| రామసాగరు | ,, | ౧౭ |
| ఆర్కాటీ | ,, | ౧౭ |
| బన్సీ | , | ౧౭ |
| అక్కూరు | ,, | ౨౪ |
| తెల్లజొన్న | ,, | ౧౦ నుండి ౧౧ |
| పచ్చజొన్న | ,, | ౯ ,, ౯౪ |
| సెనగపప్పు | ,, | ౧౭ |
| కందిపప్పు | ,, | ౧౫౪నుండి౧౬౪ |
| బెల్లం | ,, | ౧౫ ,, ౧౯ |
| ఉప్పు | ,, | ౧౨ ,, ౧౩ |
| ఉల్లి | ,, | ౨ ,, ౧౩ |

(గమనిక ఇచ్చట౨రూపాయలుఅని ప్రకటనశాఖవారు వ్రాసిపంపిన ధాన్యముకలదు బహుశా ౧౨కు ౨ అను అంకెపడినదేమో)

సంవత్సరము చందా
౭ హాలీ రూపాయిలు
ఆరుమాసాలకు
3 రూపాయిలు
బ్రిటిషిండియాలో
సం॥చందా
౫-౮-౦ కల్దారు.
పాతపత్రికలకు
వెల ప్రత్యేకము.

# గోలకొండ పత్రిక

# Golkonda Patrika

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

The only
Popular Paper
That reaches
The masses
In the Dominions

Best Medium
for
Advertisement

*Volume* **15** | **Hyderabad-Dn.** | **Thursday 25 July 1940** | ***Number 24***


## హైద్రాబాదు హిందూమహాసభ

### ఏర్పాట్ల వివరాలు

(ప్రత్యేక విలేఖరుడు)

౨౬, ౨౭, ౨౮ జూలై తేదీలలో హైద్రాబాదు మహాసభ యందలి వివేకవర్ధనీ థియేటరులో ఈ మహాసభ జరుగును. ఆహ్వానసంఘమువారు ఎన్ని వ్యవహారికములను నిర్ణయింపబడినవో ఆ పనులను రాత్రింబగళ్లను శ్రద్ధాధ్యానముతో చేయుచున్నారు.

**జిల్లా ప్రతినిధులు**

ఉత్తము జాస్తి జిల్లాలనుండియు తాలూకాలనుండియు కుదవ గ్రామాలనుండియు హిందూప్రముఖులు తండోపతండములుగా రానున్నారు. జిల్లాలలోనివారు అత్యుత్సాహముతో సభకు వచ్చుటకై ప్రమాణముకట్టినారని వార్తలువచ్చుచున్నవి. ముఖ్యముగా తెలంగాణానుండి ప్రతినిధులు తప్పక తెప్పలుగా రానున్నారు.

**మంటపము**

సుమారు ౧౦ వేల మందికి అనుకూలముగా నుండుటకై వివేకవర్ధనీ మైదానములో గొప్ప మంటపము కట్టుచున్నారు. దానిని బాగుగా అలంకరించుచున్నారు. మంటపము ముగిసిపోవచ్చినది.

**బ్రిటిషిండియా నాయకులు**

బ్రిటిషిండియాలోని హిందూమహానాయకుల కందరికిని ఆహ్వానా లంపబడినవి. చాలామంది ప్రసిద్ధ హిందూనాయకులు రానున్నారు. కొందరు తప్పకతమ తప్పకుండా వచ్చుచున్నామని ప్రత్యుత్తరములుకూడా అనుగ్రహించినారు. అందు సుప్రసిద్ధులును అఖిలభారత ప్రఖ్యాతిగన్నవారునగు డాక్టర్ బి.యస్. మూంజీగారు, జగద్విఖ్యాతిగన్న త్యాగమూర్తులును అండమాను దీవులలో బహుసంవత్సరాలు దేశసేవకై ఘోర కారాగారకష్టములను లోనైనవారునగు భాయి పరమానందుగారు, కుమారచంద్రకిరణ్ సర్దారు గారును మహాసభకురాగలరని ప్రత్యుత్తరములను అనుగ్రహించినారు.

**ఏర్పాట్లు**

రానున్న ప్రతినిధులకు భోజనవసతులకేమిన్ని లోపము లేనట్లుగా ఆహ్వాన సంఘమువారు ఉత్కృష్టమగు ఏర్పాట్లు చేసియున్నారు.

అధ్యక్షులైన అడ్వొకేటు అంబాదాసురావుగారి ఉపన్యాసము సిద్ధమైనది. ఆహ్వానసంఘమువారి ఉపన్యాసముకూడా సిద్ధమైయున్నది. మహాసభవారు విశేషముగా హిందువుల ఆర్థిక సాంఘిక విషయములను గురించి చర్చింతురని తెలియుచున్నది.

## గుజరాతు కాంగ్రెసు సంఘము

### కేంద్రకాంగ్రెసు కార్యసంఘనిర్ణయము నామోదించెను

జూలై ౨౦వ తేది అహమ్మదాబాదు నగరములో గుజరాతురాష్ట్రీయ కాంగ్రెసుసంఘమువారు సమావేశమై దేశములో గొప్ప అరాజకము దయించినను, దేశముపై పరుడు దాడివెడలివచ్చినను అహింసావిధానముతో శాంతిని రక్షించజాలమని ఢిల్లీకాంగ్రెసు కార్యసంఘమువారు గావించినతీర్మానమును ఆమోదించినారు. అధ్యక్షతవహించిన సర్దారు వల్లభాయిపటేలుగారు ఉపన్యసించుచు, కేంద్రకార్యసంఘమువారు అట్టి తీర్మానముచేయుటకు కారణము అహింసలో కార్యవర్గసభ్యులకు విశ్వాసములేకుండుట కారణముకాదనియు. తమవెన్నుకొనిన కాంగ్రెసు సభ్యులు అట్టి సర్వసంపూర్ణమైన అహింసా విధానమునకు సిద్ధముగ లేకుండుటయే కారణమనియు, ఇందుచే కార్యసంఘము గాంధిమహాత్మునితో తెగతెంపు చేసికొన్నదని అర్థముకాజాలదనియు చెప్పినారు.

## హైదరాబాదు కోఆపరేటివ్ యిన్సూరెన్సు

సొసైటి లిమిటెడ్.

బషీర్‌బాగ్ రోడ్డు-హైదరాబాదు (దక్కన్).

### అత్యుత్తమమైన వ్యాపారము

31 అమర్దాదు 1349 ఫ. నాడు

| | | |
|---|---|---|
| 1. | 1 షహరేవరు 1348ఫ. నుండి 31 అమర్దాదు 1349 ఫ. వరకు ఒక సంవత్సరమున వచ్చిన వ్యాపారము | ర్పు. 2017567 |
| 2. | 1 షహరేవర్ 1348ఫ. నుండి 31 అమర్దాద్ 1349 ఫ. వరకు పూర్తిచేయబడిన వ్యాపారము | ర్పు. 1577983 |
| 3. | కంపెనీ స్థాపననాటినుండి 31 అమర్దాద్ 1349 ఫ. వరకు వచ్చిన వ్యాపారము | ర్పు. 4724339 |
| 4. | కంపెనీ స్థాపననాటినుండి 31 అమర్దాద్ 1349 ఫ. వరకు పూర్తిచేసినవ్యాపారము | ర్పు. 3517355 |
| 5. | రక్షణ నిధి | ర్పు. 2½ లక్షలకెక్కువ. |
| 6. | జీవిత నిధి | ర్పు. 1లక్ష 60వేలకెక్కువ. |

అన్నిరకములవారికి తగిననిర్ణయములు

కార్మికులకు, కూలీలకు ప్రత్యేక పద్ధతి. జిల్లాలలోని ప్రతినిధులకు ఉదారమైన పద్ధతులు. వివరములకు బషీర్‌బాగ్ రోడ్డులోయున్న ప్రధానకార్యాలయమునకు వ్రాసి కనుగొనుడు.

| అధ్యక్షుడు: | గౌరవ కార్యదర్శి: |
|---|---|
| మౌల్వి మహమ్మద్ లియాఖతుల్లాసాహెబ్, హెచ్.సి. యస్. ప్రభుత్వ ఫైనాన్సుకార్యాలయ కార్యదర్శి. | లక్ష్మీనారాయణగుప్తగారు, హెచ్.సి. యస్. ప్రభుత్వ ఫైనాన్సు కార్యాలయ సహాయ కార్యదర్శి. |

## యుద్ధవార్తలు

(మొదటిపేజీ తరువాయి)

డాలు. దీనికై ప్రతిదిట ౨౦ వేలలక్షలడాలర్లు ఖర్చు అగును. ఈనౌకాబలముతో అమెరికాతీరము నుండి ఎటుగాని వేయిమైళ్లదూరమువరకు కాపాడవచ్చును.

### జర్మని

జర్మనుసేనలు బ్రిటనుపైకి ఎప్పుడు దండయాత్ర వెడలునని ఎక్కడబట్టినను చర్చలు చేయబడుచున్నవి. కాని అవిఅన్నియు ఉత్తఊహలే. ఇపుడు ముందుగా జర్మనీ బ్రిటిషువారికి సంధిసూచనలుచేయుననియు, అసూచనలు ఒప్పుకొనబడని తీరున బ్రిటనుపై జర్మనుసేనల దండయాత్ర జరుగగలదనియు ఊహించుచున్నారు. చర్చిల్‌వారి అనుచరులతోసహా బ్రిటిషు మంత్రివర్గమును వదలిపోవలెననియు వారిస్థానములో లాయిడ్ జార్జి, సర్ శామ్యూల్ హోర్లీగారలు రావలెననియు, బ్రిటిషు ఆయుధములనుతగ్గించి, యూరపులో జర్మనీ ఆధిక్యత నంగీకరించవలెననియు సంధిసూచనలు చేయబడునని ఒకవిలేఖరిఊహ. బ్రిటనుపై దాడి వెడలకూడదని జర్మనుసేనలో ఒక పక్షమువారు చెప్పుచున్నారని లండనునుండి వ్యాపించిన ఒక వార్తలోనున్నది.

**హిట్లరుగారికి బ్రిటను జవాబు**

హిట్లరుగారి రీచ్‌స్టాగు ఉపన్యాసముపై కొన్ని అభిప్రాయములు వేరేపేజీలో ప్రకటించబడియున్నవి. బ్రిటిషు విదేశాంగమంత్రి లార్డు హాలిఫాక్సుగారు జూలై ౨౨వతేది బ్రాడ్‌కాస్టు ఉపన్యాసములో సమాధానమిచ్చినారు.

బ్రిటిషువారు యుద్ధముఅవసరమైన దానికంటెఎక్కువకాలము సాగవలెనని కోరుటలేదనియు, యూరపులో అన్ని దేశములును హిట్లరుదాస్యబంధమునుండి విముక్తిజెంది బ్రిటనుతో పాటుమరల తమస్వాతంత్ర్యమునకు ఇకభయములేదని ధైర్యముచెందు స్థితివచ్చునంతవరకు ఈపోరాటము సాగుచునేయుండగలదనియు, హిట్లరు తనదేశములోప్రజల అంతరాత్మలనుకూడ నిర్బంధములో పెట్టుచున్నాడనియు ప్రతివాడును తన కిష్టమగురీతిని భగవంతునిగొలుచుటకు స్వాతంత్ర్యము ఉండవలెననియు, అందువల్ల హిట్లరు చర్య క్రీస్తుమతవిరుద్ధమనియు, భగవంతునియందు విశ్వాసముంచి అట్టిదురాత్మరుడగు హిట్లరునుండి యూరోపుఖండదేశాలకు భయముతప్పించవలెయుననియు చెప్పిరి. హిట్లరుయొక్క బలముతయు బ్రిటనుకోటలవద్ద ఎన్నడు భగ్నమగునాయని ఇపుడు హిట్లరు ఆక్రమించిన దేశాలప్రజ అందరు హృదయములలో కోరుచున్నారు. వారలకోరికలు వ్యర్థముగాపోజాలవని హాలిఫాక్సుగారు చెప్పిరి.

### ఇటలీ యుద్ధము

ఇటలీతో యుద్ధములోచిన్న పోరాటాలు, విమానాలనుండి బాంబులువేయుటతప్ప విశేషాలేవియులేవు. బాంబులువేయబడిన ప్రదేశాల పేర్లుఇదివరకుచూచినవే.

### జర్మనీ, బ్రిటనులపై విమానాల దాడులు

జర్మనీపైబ్రిటిషువిమానాలు,బ్రిటనుపై జర్మనీ విమానాలుతిరుగుచు బాంబులువేయుచునేయున్నవి జూలై ౧౯వతేదిమధ్యాహ్నము ఒక్కసారి ౭౦ జర్మనువిమానాలతోను, సాయంత్రము ౩౦ జర్మనువిమానాలతోను బ్రిటిషువిమానాలు పోరాడెను. ఉదయము, మధ్యాహ్నము, సాయంకాలము, రాత్రివేళలలోకూడ బాంబులువేయబడుచున్నవి. జూలై ౨౧ వ తేదిన ఒక్కసారి ౧౦౦ విమానాలు ఆకాశంలోపోరాడుచుండెను. జూలై ౨౧వతేది మధ్యాహ్నము ౮౦జర్మనువిమానాలు బ్రిటిషుఓడలపై బాంబులువేసెనుఇట్టి జర్మను విమానాలు జూను ౧౫నుండి ఇంతవరకు ౧౮౬ బ్రిటిషువారిచే క్రిందకూల్పబడినవి.

## ఒరిస్సా కాంగ్రెస్‌వాదుల ద్రోహము

### గోదావరి మిశ్రాగారు అసెంబ్లీకాంగ్రెసు పార్టీనుండి వెడలగొట్టబడుట

కటకము, జూలై ౧౫

ఒరిస్సా కాంగ్రెసు అసెంబ్లీ పార్టీనాయకుడగు శ్రీవిశ్వనాథదాసుగారు ఈ క్రిందిప్రకటనము గావించుచున్నారు:

పండిత గోదావరిమిశ్రాగారు ఒరిస్సా అసెంబ్లీ కాంగ్రెసుపార్టీసభ్యుడు. కాంగ్రెసు టిక్కెట్టుపై ఆతడెన్నుకొనబడెను. రామఘరు కాంగ్రెసుతీర్మానమును, అసెంబ్లీ యుద్ధతీర్మానము విషయమై కాంగ్రెసుఅసెంబ్లీపార్టీవారు ఏకగ్రీవముగ నిర్ణయమును కాలదన్నిపోవుచేసి యిప్పుడుఈతడు మంత్రివర్గమేర్పరుచు నుద్దేశముతో ప్రతిపక్షులలో చేరియున్నాడు. కావున ఈతడు పార్టీనుండి వెడలగొట్టబడుచున్నాడు. ఆయనతోచేరిన యితరుల విషయమై సంగతులు తెలియగానే తగినచర్య గైకొనబడును. వారుచేసినపని రాష్ట్రీయకాంగ్రెసు సంఘమునకు, పార్లమెంటరీ సబ్‌కమిటీకిని తెలుపబడును.

**ఒరిస్సాకాంగ్రెసు అసెంబ్లీపార్టీవారి తీర్మానము**

గోదావరి మిశ్రాగారి చర్యను, ఆయనతోచేసిన యితరులచర్యను తీవ్రముగా ఖండించుచు ఒరిస్సాఅసెంబ్లీ కాంగ్రెసుపార్టీవారు ఈక్రింది తీర్మానమును గావించిరి.

“కాంగ్రెసు తీర్మానములకును ముఖ్యముగా రామ్‌ఘర్ కాంగ్రెసు తీర్మానమునకును భిన్నముగా సంయుక్తమంత్రివర్గము నేర్పరుచుటకుప్రతిపక్షులలో చేరినకాంగ్రెసువాదుల చర్యను ఈ సభవారు తీవ్రముగా నిరసించుచున్నారు ఇట్లుచేయుటవలనవారు పెద్దఎన్నికల నొసంగిన వాగ్దానములను భంగపరచిరి. దేశమునకు ద్రోహము చేసిరి. పార్టీవిశ్వాసము గోల్పోయిరి. కావున యిందుకుదగిన శాస్తిచేయవలెనని సభవారు పార్టీ నాయకుని కోరుచున్నారు.”

బ్రిటిషువిమానాలు జర్మనీపైఎగిరి జూలై ౧౯వతేది పాడర్‌బారన్ విమాననిర్మాణ యంత్రాలయముపై బాంబులువేయుటవల్ల అది పాడయ్యెను, ఇంకను ప్రతిరోజు అనేకముగైన సైనిక ప్రాముఖ్యస్థలాలపైనను వస్తువులపైనను బ్రిటిషువారు బాంబులువేసిరి.

## దేశరక్షణ నియమాల క్రింద అరెస్టులు

ఏలూరు, జూలై౧౯

రాష్ట్రీయ చేనేతగాంధ్ర సంఘ సంయుక్త కార్యదర్శియు జిల్లా కాంగ్రెసు కమిటీ సభ్యుడునగు శ్రీ కొడుపు రాములుగారు రాత్రి అరెస్టుచేయబడిరి. దండుపాటి మాణిక్యాలరావుగారి సైకిల్‌షాపు గోడలమీద యుద్ధ ప్రతికూల ప్రకటనలు అంటించుచుండగా అరెస్టు జరిగెనని చెప్పుచున్నారు. ఉదయము పోలీసు సబ్‌ఇన్‌స్పెక్టరు టొబాకో లేబర్ యూనియను కార్యదర్శియింటిని సోదాచేసి కొన్ని యుద్ధప్రతికూల ప్రకటన పత్రాలను తీసికొనిపోయెను, టొబాకో లేబర్ యూనియను కార్యదర్శిగూడ అరెస్టు చేయబడెను.

గోరఖపూరు, జూలై౧౯

గత మేమాసములో యుద్ధప్రతికూల ప్రచారము గావించినందులకు గోరఖ్‌పూర్ జిల్లా కాంగ్రెసుకమిటీ కార్యదర్శిగారికి ఒకసం॥ కఠిన శిక్ష విధింపబడెను.

### ‘హరిజన్’కార్యాలయము మార్పు అసత్యము

“హరిజన్”పత్రిక కార్యాలయము పూనా నుండి అహమ్మదాబాదుకు మార్చబడునని ప్రకటితమైనవార్త అసత్యమని ఇపుడాకార్యాలయ నిర్వహణము చేయుచున్న చంద్రశేఖర శుక్లాగారు తెల్పుచున్నారు.

### గోదావరిమిశ్రగారికి సహాయంలేదనుట

ఉత్కళ అసెంబ్లీలోనున్న ౩౯ మంది కాంగ్రెసు సభ్యులలోను గోదావరి మిశ్రగారి పక్షమవలంచేవారు ముగ్గురేవున్నారు. అటువంటప్పుడు వీరున్ను నేషనలిస్టు పార్టీవారున్నుకలిసి యేర్పరచదలచిన మంత్రివర్గం మిశ్రమ మంత్రివర్గమని గవర్నరుగారు యేలాగు చెప్పగలుగును?” అనిపత్రికలలో హరికృష్ణమెహతబు గారు చెప్పిరి.

“ఉత్కళ అసెంబ్లీలో మొత్తం ౫౧ మంది సభ్యులలోను కాంగ్రెసువారు 3౯ మంది వీరిలో ౩౬ మంది మిశ్రమ మంత్రివర్గానికి ప్రతికూలురుగావున్నారు.” అని ఉత్కళ కాంగ్రెసు మంత్రులలో ఒకరైన సత్యానంద కానుంగోగారు చెప్పినారు.



Printed and Published by. G. Ramakrishna Reddy at the Golkonda Power Press. Hyderabad Dn, Edi